THE

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

Fifth Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 31st October* 1957

The House met at half Past Eight of the Clock.

[*Mr. Speaker in The Chair*]

## QUESTIONS AND ANSWERS

(*See Part I.*)

### Adjournment motion re: evicction of tenants in Inam villages.

శ్రీ పి. యస్. అప్పారావు (పాలకొండ) :—Eviction of tenants గురించి నేను వారం రోజులయి ఒక adjournment motion కు notice ఇచ్చియున్నాను.

మిస్టర్ స్పీకర్ :—దానిని గురించి Act చేయాలన్నారు. ఇవాళ ఇచ్చేటప్పటికి ఆలస్యమవుతుంది. 'Mass eviction of cultivating tenants in Inam villages though the Act does not apply to such villages అంటూ వారు చెప్పారు. దాని విషయంలో మంత్రిగారు యేమి చెబుతారు.

*రెవిన్యూ మంత్రి (శ్రీ క. వెంకటరావు) :—నేను నిన్న, మొన్న చర్చలో మనవి చేశాను. ఈ mass అనేది అసలు తప్పు. ఎందుచేతనంటే అక్కడ mass లేదు. ఇనాం దారులు mass కాదు. రైతులు mass కాదు; వారు అసలు దేశంలో limited-number ఉన్నారు; mass అనేది correct అయిన description కాదని నా మొదటి contention. రెండో విషయం, evictions అనేది యివ్వాళ్ళ

urgent, immediate ఈ రకంగా జరిగేది క్రొత్తగా యేమీ జరుగలేదు. రెండు కూడా యేమీ Act పెట్టలేదు. ఇదివరకున్న Act క్రింద రెండు సంవత్సరాలలోనూ protection వుంది. ఆ చట్టాల ప్రకారం ఇనాందారు దగ్గరగాని, జమీందారు దగ్గరగాని వున్నటువంటి tenant ను evict చేసేటువంటి హక్కు ఎవరికీ లేదు. రెండో విషయం యేమిటంటే ఆంధ్ర Tenancy Act క్రింద కూడా ఇతరులను అక్టోబరు ఒకటవ తారీఖున ఎవరయితే tenant క్రింద వున్నారో వారిని రెండు సంవత్సరాల దాకా తొలగించడానికి వీలులేదు—ఒక సంవత్సరం కౌలు ఇవ్వనప్పటికీ కూడా. అందు చేత protection రెండు శాసనాలలోనూ కూడా అలాగే వున్నాయి. ఎవరయినా బయిటికి వెళ్ళిపోతే తమ హక్కును స్థాపించుకోడానికి శక్తి లేనటువంటి వారు వెళ్ళిపోవాలి నిజముగా హక్కు లేనటువంటి వాళ్ళు వెళ్ళిపోవాలి. అందుచేత శాస్త్ర రీత్యాగాని, ఉపసరం రీత్యాగాని, యే రకంగా చూసినప్పటికీ కూడాయీ adjournment కు సంబంధించిన విషయం దీంట్లో యేమీ లేదని మనవి చేస్తున్నాను.

శ్రీ పి. యస్. అప్పారావు :—ఇప్పుడు తహశీల్దార్లు పెట్టనే evictions orders యిస్తున్నారు, కుమ్మక్కు చేస్తున్నారు. Appeal వరకూ time లేకుండా భూస్వాములు వెళ్ళగొట్టేస్తున్నారు. Tenancy Act క్రింద అగ్రహారీకులు కూడా తహశీల్దారు దగ్గర పిటీషనులు పెడుతున్నారు. ఇదివరకు మంత్రిగారికి complaints కూడా యిచ్చివున్నారు. Tenancy Act క్రింద tenants కు అగ్రహారాలకు సంబంధం లేదు. అయినా Tenancy అగ్రహారీకులు రైతులను వెళ్ళగొడుతున్నారు. అలా కాకుండా చేయాలని మంత్రిగారిని మళ్ళీ కోరుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు :—వారు చెప్పిన రెండో విషయమే నేను అంగీకరిస్తున్నాను. ఎక్కడయినా అలాంటి పని జరిగినట్లయితే యిప్పుడున్న legislation ప్రకారం 1948 నుంచి వుండి తప్పు చేసిన ఎవరికైనా పంపిస్తే restore చేసుకునే హక్కు మనం తీసుకున్నాం. Tenancy Act వారికి అన్వయించదు. ఈ విషయంలో నేను అందరు కలెక్టర్లకు instructions పంపించాను. ఇంకా individual గా ఎక్కడయినా పొరపాటు జరిగితే నా దృష్టికి తీసుకుని వచ్చినట్లయితే తప్పకుండా వాళ్ళకు రక్షణ కల్పించేటటువంటి మన్నతు ప్రభుత్వం యిస్తుంది.

మిస్టర్ స్పీకర్ :—ఇది ఒక Act కు సంబంధించినటువంటి విషయం, ఏవయినా individuals కి అక్రమాలు జరిగితే చూస్తాం అన్నారు. I therefore disallow the adjournment motion.

## Calling attention to matters of urgent Public Importance namely proposal to retrench teachers.

*Mr. Speaker:* Sri Yellamanda Reddy gave notice of the following motion.

"Under Rule 74, I call attention of the hon. Minister for Education to the following urgent matter of public importance:

"To cancel the order of the Government proposing to retrench teachers who are not having 40 students per teacher on their rolls in the elementary schools under the management of Government, District Boards as well as private management.'. "

రూలు 74 క్రింద మంత్రిగారేదైనా చెప్పవల్సియుంటే వింటాము.

*The Minister for Education (Sri S. B. P. Pattabhirama Rao)*: I want time, Sir.

*Mr. Speaker:* All right, we shall take it up on 6th November.

## Adjournment motion re. Dismissal of four workers of the Vuyyur Sugar Factory.

*Mr. Speaker:* I have received notice of the following adjournment motion from Sri V. Visweswara Rao.

"The House stands adjourned to discuss the failure of the Government to prevent the management from dismissing the 4 (four) workers of the Vuyyur Sugar Factory on 26-10-1957 by the management, thus creating grave situation and discontent among the workers".

సాంఘిక సంక్షేమ మరియు కార్మిక శాఖామంత్రి (శ్రీ డి. సంజీవయ్య) :—సాధారణంగా Factory లుంటాయి., యజమానులుంటారు. workers వుంటారు. Standing Orders వుంటాయి. అక్కడి Standing Orders కు వ్యతిరేకంగా ప్రవర్తించినట్లయితే indiscipline అనో misbehaviour అనో workers ను dismiss చేస్తారు. ఆ dismissal justifiable కాదనే contention అయితే వారు Labour Officer దగ్గరకు పోతారు. అది point of dispute అవుతుంది; conciliation అవుతుంది. Conciliation లో విజయవంతమయితే మంచిదే. లేకపోతే Tribunal కు పంపిస్తాం. ఈ విధంగా జరుగుతుంది. కాబట్టి నలుగురు వర్కర్లను ఎక్కడో dismiss చేస్తే దానికై adjournment motion తీసుకు రావడం నాకేమీ అర్థంకావడం లేదు.

మిస్టర్ స్పీకర్ :—నలుగురు పనివారిని ఒక పంచదార ఫ్యాక్టరీలో dismiss చేయడంతోటే grave situation of public, urgent importance arise కాదు. వాళ్లు Labour Office కు పోతారు. Tribunals వున్నాయి. So, I disallow the adjournment motion.

*Sri Pillalamarri Venkateswarlu (Nandigama)*: Point of information, Sir.

*Mr. Speaker:* I have finished. No point of information.

*Sri Pillalamarri Venkateswarlu:* There is a point of information, Sir.

*Mr. Speaker:* I have closed.

## Adjournment motion re. Withdrawal of the interim increase of dearness allowance

*Mr. Speaker:* Sri B. Srirama Murthy and Sri P. Narsinga Rao gave notice of the following adjournment motion:

"The House stands adjourned to discuss an urgent matter of public importance, *i.e.* the situation arising out of the withdrawal of the interim increase of dearness allowance of Rs. 6 to the workers of the Water Works, Electricity and P.W.D. workshops".

This cannot be a matter of urgent or immediate public importance.

ఇది ఎప్పటినుంచో జరుగుతున్నది. 6 రూపాయిలు withdraw చేయడం, దాన్నిగురించి ప్రశ్నలు వేయడం, ప్రభుత్వంవారు సానుభూతి చూపిస్తున్నారు గాని యివ్వడంలేదు అదంతా ఏదో వున్నదే కనుక—

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—ఆ విషయం మంత్రిగారిచేత చెప్పిస్తే మాకు ఎక్కువ అర్థం అవుతుంది.

మిస్టర్ స్పీకర్ :— Adjournment motion మాత్రం లేదని అంటున్నాను.

శ్రీ పి. నరసింగరావు(హుజూరాబాద్–జనరల్) :—ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటులో 6 రూపాయలు అదనపు కరువు భత్యం యింతకుముందు యిస్తున్నా, ఈ మాసము నుంచి ఆపుతున్నారు. కాబట్టి urgent విషయమైనది. ఆ విధంగా ఆపడానికిగల కారణాలు చెప్పించాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—ఇదివరకు ఆపిందికాదు. Then the hon. Minister may explain.

ఆర్థిక శాఖా మంత్రి (డాక్టరు బి. గోపాలరెడ్డి) :—ఈ విషయంలో భారత ప్రభుత్వం వారితో చాలా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. వాళ్ల రూలు ప్రకారంగా యీ Electricity department, Drainage department, Industrial department ఏవయి నప్పటికీకూడా మనం యిచ్చినా, వారు జోక్యం కలుగ జేసుకోలేదు ; Contribution యివ్వడం లేదు. వాళ్లు దేనికి contribution యివ్వడంలేదో అది మేము నిరాకరించవలసి వస్తుంది. Electricity Department కు

మూడు మాసములు యిచ్చినాము, సిబ్బంది. కాని సెప్టెంబరు నుండి [illegible]. అక్టోబరు మొదటి తేదీనుంచో అది "బంద్" అయినది. భారత ప్రభుత్వం [illegible] contribution యివ్వడం లేదు కాబట్టి, మనం యిచ్చుకునే శక్తిలేదు కాబట్టి [illegible] కూడా "బంద్" చేయడంజరిగింది.

శ్రీ యం. నాగిరెడ్డి (మాచెర్ల) :—ఇదివరకిచ్చిన ఆరు రూపాయలు కూడా refund అడుగుతున్నారు. అదయినా అడుగకుండా చూస్తారా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—అప్పకుండా చూస్తాం.

*Mr. Speaker:* The adjournment motion is disallowed. in view of the answer given by the hon. Minister. As explained by him, it is a matter between the Government of India and the State Government, and correspondence between the two Governments has been going on. This subject was under discussion and some orders have been passed; and only they are now being put into force. Therefore, it is not a new matter and no question of urgent public importance arises now.

[*Sri B. Srirama Murthy rose in his seat*].

*Mr. Speaker:* Will the hon. Member resume his seat ?

As regards the point that has been raised by Mr. Nagireddi, the hon. Minister said that he would look into the matter and do everything necessary. Therefore, where is the need for an adjournment motion ?

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) :—కేంద్ర ప్రభుత్వం తాను యివ్వకపోతే యివ్వకపోవచ్చు కాని శాసనసభ వేదిక మీద ఒకరికి నలుగురు మంత్రులు "నూరు రూపాయలలోపల జీతం తీసుకుంటున్న ప్రతిఉద్యోగస్థునికిమేము అదనంగా 6 రూపాయలిస్తాం" అని Budget Session లో వాగ్దానం చేసేటప్పుడు యీ షరతు పెట్టలేదు. కేంద్రప్రభుత్వం యిస్తేనే 100 రూపాయల లోపు జీతం వచ్చువారికి అదనంగా ఆరు రూపాయలు యిస్తాం అని ఆ రోజున ఏ మాత్రం చెప్పలేదు. "100 రూపాయలు లోపలవచ్చేవారికందరికి 6 రూపాయలు అదనంగా యిస్తాం" అని చెప్పినారు. కేంద్ర ప్రభుత్వం యివ్వకపోయినంత మాత్రాన తన వాగ్దానం నిలబెట్టుకోడానికయినా సరే రాష్ట్రప్రభుత్వమే భరించుకోవాలి. కనీసం రాష్ట్రప్రభుత్వం యిదివరకు యిస్తున్నటువంటివి అయినా యివ్వడానికి చూడాలి. ఆ రెండూ కాకుండా పూర్తిగా 6 రూపాయలు మినహాయించడం శాసనసభ వేదికముందు మంత్రివర్గం చేసిన వాగ్దానానికి వ్యతిరేకంగా పోవడం అనేది 'a matter of serious concern' కాబట్టి ఇది adjournment కు తగిన ప్రతిపాదన అని నేను విన్నవిస్తున్నాను.

*డాక్టర్ బి. గోపాలరెడ్డి :—ఇండియా గవర్నమెంటువారు ఇచ్చినా, ఇవ్వకపోయినా మేము 6 రూ. లు ఇస్తామని ఏ మంత్రి చెప్పలేదు. 60 రూ. లోపల వారికి $\frac{2}{3}$, ఆ పైన వున్న వారికి $\frac{1}{3}$ ఇస్తామని కేంద్ర ప్రభుత్వం చెప్పటంవల్ల ఈ ప్రణాళిక ఉత్పన్నమైనది. అంతేగాని మనకు ధనం వుందని, మనకు ఆర్థిక సౌష్టవము బాగా వున్నదని, అందుచేత ఇస్తామని వేసిన స్కీము కాదు. Commercial undertakings ను అంటే డ్రయినేజివారికి, ఎలక్ట్రిసిటి వారికి వీలులేదని వారు చెప్పిన తరువాత మేము జమా ఖర్చులు చూచుకొని, ఈ పనివారికి ఇచ్చే శక్తి మనకు లేదు కాబట్టి మానివేశాము. అంతేకాని దయాదాక్షిణ్యాలు లేకకాదు. మనకు కేంద్ర ప్రభుత్వం ఇచ్చినా, ఇవ్వకపోయినా మనకు ఇచ్చే శక్తివుంటే ఇవ్వవచ్చు కాని మనకు ఆ శక్తిలేనందువల్ల ఇవ్వలేమని చెబుతున్నాము. అంతేకాని వారు ఇచ్చినా, ఇవ్వకపోయినా మేము ఇస్తామనే వాగ్దానము మేము చేయలేదు.

శ్రీ పి. సుందరయ్య :—వారు ఇస్తేనే ఇస్తామని కూడా మీరు చెప్పలేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—చెప్పవలసిన అవసరం లేదు.

*Mr. Speaker:* I have disallowed it. I am not going to permit any more discussion.

*Sri B. Srirama Murthy (Vizianagaram)*: Point of order, Sir. When these facilities are extended to the workers of the Secunderabad and Hyderabad Municipalities, I do not see any reason why the same facility should not be extended to workers of Water Works, and Electricity and P. W. D. Workshops. I therefore take it that the reason given by the hon. Minister is not at all justifiable. Therefore, a point of order arises in the matter and I request you, Sir, to give a ruling. A definite and specific assurance has been given by the hon. Minister on a different occasion and I request you Sir, to give a ruling in view of his present reply.

*Mr. Speaker:* I said, I have already disallowed the motion for adjournment. A point of order does not apply to questions of fact. A point of order arises if anything is done against the rules or against the Constitution either by the Minister or by any other Member. There is no point of order with regard to questions of fact. I have already decided that no new matter of any importance has arisen. I shall proceed now to the next subject.

## Resolution on Election of a Member to Zonal Railway Users' Consultative Committee of the South-Eastern Railway

*The Minister for Communications (Sri M. Narsing Rao):* I beg to move:

"That as the term of the present Members of the Zonal Railway Users' Consultative Committee of the South-Eastern Railway will expire on the 31st December 1957 and the Committee will have to be reconstituted thereafter and as the General Manager, South Eastern Railway has requested the Government to communicate to him the name of the member to represent the Andhra Pradesh State Legislative Assembly on the Committee for the term of its office from 1-1-1958 to 31-12-1959, this Assembly do recommend to the Government to communicate to the South Eastern Railway the name of one member belonging to the area covered by the South-Eastern Railway elected by this Assembly to serve on the Committee for the above period".

*Mr. Speaker:* Motion moved.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—ఇదివరకు ఇటువంటి తీర్మానము వచ్చినప్పుడు లేదని చేశాము. ప్రతి దానిలోను ఒక్క మెంబరే అని వస్తున్నది. ఒకటినుండి మూడువరకు పెంచాలని oral గా ఒక సవరణ పెడుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—అలా చేసే అధికారము మనకు వున్నదా? వారు ఒకరినే పంపమంటే అంతమందినే పంపవలెనా? లేక ఒకరిని పంపమని వారు అడిగితే మనం ముగ్గురిని పంపిస్తే ఏమి బాధము లేదు. అలా పంపే అధికారము మనకు వుంటే వెంకటేశ్వర్లుగారు చెప్పినది సమంజసమైనది.

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా! ఒకరినే కాదు. ముగ్గురిని ఎన్నుకొని పంపించాలని శాసనసభ తరఫున మనము ఒక సవరణను తెచ్చే హక్కు వుంది. శాసన సభ ఆమోదిస్తే, దానిని గురించి ప్రభుత్వము చర్చ తీసుకొని ఆ జోనల్ కమిటితో సంప్రదించాలి. అప్పుడు మనం ఎన్నుకోవచ్చు. శాసన సభకు మించే అధికారం జోనల్ కమిటికిలేదు. అందుచేత ప్రజాస్వామిక హక్కులు కాపాడటానికి వీలుగా ముగ్గురిని ఎన్నుకోడానికి ఒక సవరణ ప్రతిపాదించే హక్కు మనకు వుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—మూడుకోట్ల ప్రజలకు ముగ్గురిని ఎన్నుకొని పంపటం ఎక్కువ కాదు. అలా ఎన్నుకొని పంపించే అధికారం మనకు వుందా? లేదా అని ప్రతిష్ఠ సమస్యగా ఆలోచించకుండా మన అవసరాలను గుర్తించి ఆ విధంగా చేయాలని మంత్రి మండలికి తెలియ చేస్తున్నాను.

శ్రీ యమ్. నరశింగరావు :—మన స్టేటులో మూడు జోనల్ కమిటీలు వున్నాయి. ప్రతి జోనల్ కమిటీలోను ఒక్క సభ్యుడే వుండడు. ఇంకా వేరే చోటునుండి వచ్చే సభ్యులు వుంటారు.

**1. One representative of each of the Governments of the States served by the Railway as recommended by such Governments.**

2. One representative of the States' Legislatures recommended by the State Governments.

3. Not more than 5 representatives of the principal chambers of Commerce and trade associations recognised by the State Government or Governments and having a standing of not less than five years.

4. Two representatives to be sent by the State Government or State Governments of agricultural associations and other bodies not included in or affiliated to the Chambers of Commerce.

5. Two non-official representatives elected from each of the Regional Railway Users' Consultative Committees.

6. One representative of the ports of Bombay, Calcutta and Madras in the case of railways serving those ports.

7. Two Members of Parliament.

శ్రీ ఆర్. వి. రామకృష్ణరాజు (వదమలపేట) :—ఈ Rules ఎవరు చేశారు ?

శ్రీ యం. నరసింగరావు :— Government of India వారు చేశారని మనవి చేశాను. State Legislature నుంచి ఒకరు, గవర్నమెంటుచే నామినేట్ చేయుబడినవారు ఒకరు మనతరఫునుంచి P. W. D. Secretary గారు పెడుతున్నారు. ఇంకొకరు Chamber of Commerce నుంచి పెడతారు. సభ్యులు amendment పెడతామంటే నాకేమీా అభ్యంతరం లేదు. కాని యిది గవర్నమెంట్ ఆఫ్ ఇండియా పెట్టిన సంస్థ.

మిస్టర్ స్పీకర్:—గవర్నమెంట్ ఆఫ్ ఇండియా? లేక రైల్వే బోర్డా ? Railway Board is different from Government of India.

డాక్టర్ బి. గోపాల్‌రెడ్డి :—ఇంకా బెంగాల్, మధ్యప్రదేశ్‌లు ఉన్నాయి. వారందరికి యివ్వకుండా మనకొక్కరికి ముగ్గురు మెంబర్లను పంపే అవకాశం యిస్తారని నాకు నమ్మకం లేదు. మనం ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలోపల ఉన్న ఒక్క మెంబరు కూడా లేకుండా చేసుకునే పరిస్థితి తటస్థిస్తుంది.

శ్రీ పి. సుందరయ్య :—అది రైల్వేబోర్డు చేయవచ్చు, లేకుంటే Zonal Authority చేయవచ్చు. ఏమైనప్పటికి శాసన సభ తరఫునుంచి ఒకరు, మంత్రివర్గం తరఫునుంచి ఒకరు ఇతర వ్యాపార సంస్థనుంచి ఒకరు, వ్యవసాయ సంస్థలనుంచి ఒకరు—ఈ విధంగా వుంటే వుండవచ్చు. వారందరి తరఫునా మెంబర్ల సంఖ్య ఎక్కువ చేయాలని మనం కోరడం లేదు. వారు కావాలని petition పెట్టుకుంటే మనం recommend చేయువచ్చు. కాని,

మొత్తం రాష్ట్రానికి సంబంధించి, ప్రజలయొక్క వ్యాపార సంస్థల యొక్క విషయాలలో వృద్ధిలో శ్రద్ధ తీసుకోవడానికి మన శాసన సభనుంచి వెళ్ళే ఒక్క మెంబరు చాలదు. ఆంధ్ర రాష్ట్రానికి ఒక **Zone** యిస్తే ఎంతమంది ఉంటారు? అస్సాంలో ఫస్ట్ ప్లానులో ఒక **Zone** పెట్టినట్లుగా ఆంధ్ర రాష్ట్రంలో కూడా పెట్టినట్లైతే **Central Zone. South-East Zone. Southern Zone** ఈ మూడు తీసేసి [illegible] చేస్తే ఇప్పుడు మంత్రిగారు చెప్పిన ప్రాతిపదిక ప్రకారం ఈ శాసన సభ నుంచి [illegible] [illegible] **represent** చేయడానికి వీలవుతుంది. [illegible] **Centre** నుంచి కొంత, **South** నుంచి కొంత, **South East** నుంచి కొంత, **North East** నుంచి కొంత............ఈ విధంగా ఒక్కొక్క ప్రదేశాన్ని ప్రాంతాలను కలిపి చేసినప్పుడు ఒక్క మెంబరే ఉన్నట్లయితే ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజానీకం, వ్యాపార సంస్థలు, ఇతర పరిశ్రమల యొక్క విషయాలను **Railway Zone** లో స్పష్టంగా చెప్పడానికి సాధ్యంకాని పరిస్థితి ఏర్పడుతోంది. విడివిడిగా ప్రాంతాలకోసం మన శాసన సభ నుంచి ముగ్గురు మెంబరు కావాలి. మనది ఎక్కువ భాగం **Central Zone.**

డాక్టరు బి. గోపాలరెడ్డి :— **Next motion is for Central Zone.** ఈ **motion** మాత్రం **South-Eastern Zone** ఇవ్వాళ రమ్మంది వాళ్ళే మనకు, ఇంకా ఒరిస్సా, బెంగాల్, మధ్యప్రదేశ్‌లోకి కూడా పోతుందనుకొంటాను. ప్రభుత్వాలకు యివ్వకుండా మనకు యిస్తారని నేను అనుకోను.

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా, ఇతర రాష్ట్రాల వారికి యివ్వలేము కాబట్టి మనకూ యివ్వరని ఎందుకు అనుకోవాలి? వారికి యివ్వవద్దని మనము కోరడం లేదు. మనకు యిచ్చి వారికీ యివ్వమనండి. మూడు ఏండ్లనుంచి ఈ సమస్య వస్తూనే ఉన్నది. దీనిని గురించి ప్రతి సమావేశంలోనూ చెబుతున్నాము. కాని ప్రభుత్వమేమీ చర్య తీసుకొనుట లేదు. సవరణ పెట్టడం మాత్రమే జరుగుతున్నది.

మిస్టర్ స్పీకర్ :—నేను ఈ **amendment**ను ఒప్పుకొంటున్నాను. ఇక తమ ఇష్టం, సభవారి యిష్టం.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—అధ్యక్షా, ఇప్పుడు మంత్రిగారు చెప్పినట్లుగా ఆ ఒక్క మెంబరూ లేకుండా పోయే పరిస్థితి ఏర్పడకుండా ఒక మెంబరు అనే దానిని ఒప్పుకుంటూ, ఒక్కరూ చాలరు ఇంకా యిద్దరు కావాలని కోరితే బాగుంటుందనుకుంటాను.

డాక్టరు బి. గోపాలరెడ్డి :—ఈ **motion** ను **accept** చేసుకుంటూ అట్లా శిఫార్సు చేయమంటే డిపార్టుమెంటువారు చేస్తారు. **Southern Railway, North Eastern Railway, Central Railway** ఈ మూడూ కాకుండా ప్రత్యేకంగా ఆంధ్ర జోన్ ఏర్పాటు చేస్తే బాగుంటుందని శ్రీ ఒగ్గీవన్ రావుగారికి చెప్పదల్చినది.

శ్రీ ఆర్.బి. రామకృష్ణరాజు :—అధ్యక్షా, ఇప్పుడు ఒక్కరినే ఎన్నుకొని ఆ ఒక్కరూ చాలరు కాబట్టి యింకా యిద్దరు కావాలని కోరితే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ :—ఈ ఒక్కరిని ఎన్నుకొని ఇంకా ఇద్దరు సభ్యులు కావాలి అని add చేయడం వీరి amendment. కాబట్టి ఆంధ్ర ప్రదేశ్ లెజిస్లేటివ్ అసెంబ్లీ తరఫున మరో ఇద్దరిని ఎన్నుకోవడానికి అనుమతి యివ్వవలసినదని ఇండియా గవర్నమెంటుతోనూ, రైల్వేబోర్డు తోనూ correspond చేయవలసియున్నది. ఏకగ్రీవంగా యిది అంగీకరించ బడినది. ఒక్కరినే యిప్పుడు ఎన్నుకుంటాము. మిగిలిన యిద్దరికొరకు క్రింద add చేయండి. ఈ విషయమై దీనికి సంబంధించిన రైల్వే బోర్డుతో correspondence జరపాలని సభయొక్క అభిప్రాయం. ఇంతవరకూ యిది ఏకగ్రీవంగా మంజూరయినది. ఈ ఒక్కరిని ఎన్నుకోవడం విషయంలో 2–4–57 వ తేదీన 3 గంటలకు nominations వేయవలసినదని నిర్ణయిస్తున్నాను. Nominate చేయబడిన వారి సంఖ్య ఒకటికంటె ఎక్కువ ఉన్నట్లయితే pole కు పెడతాము. దీని విషయములో ఇంతే.

*Mr. Speaker:* The question is:

"That as the term of the present Members of the Zonal Railway Users' Consultative Committee of the South-Eastern Railway will expire on the 31st December, 1957 and the Committee will have to be reconstituted thereafter and as the General Manager, South-Eastern Railway, has requested the Government to communicate to him the name of the member to represent the Andhra Pradesh State Legislative Assembly on the Committee for the terms of its office from 1-1-1958 to 31-12-1959, this Assembly do recommend to the Government to communicate to the South-Eastern Railway the name of one member belonging to the area covered by the South-Eastern Railway elected by this Assembly to serve on the Committee for the above period."

The motion was adopted.

## Resolution on the election of a member to the Zonal Railway Users' Consultative Committee of the Central Railway.

*Sri M. Narsinga Rao:* I beg to move:

"That as the term of the present Members of the Zonal Railway Users' Consultative Committee of the Central Railway will expire on the 31st December 1957 and the Committee will have to be reconstituted thereafter, the Government have to communicate to the General Manager, Central Railway the name of the member to represent the Andhra Pradesh

State Legislative Assembly on the Committee for the terms of its office from 1-1-1958 to 31-12-1959 this Assembly do recommend to the Government to communicate to the Central Railway the name of one member belonging to the area covered by the Central Railway elected by this Assembly to serve on the Committee for the above period."

*Mr. Speaker:* The question is:

"That as the term of the present Members of the Zonal Railway Users' Consultative Committee of the Central Railway will expire on the 31st December 1957 and the Committee will have to be reconstituted thereafter, the Government have to communicate to the General Manager, Central Railway the name of the member to represent the Andhra Pradesh State Legislative Assembly on the Committee for the terms of its office from 1-1-1958 to 31-12-1959 this Assembly do recommend to the Government to communicate to the Central Railway the name of one member belonging to the area covered by the Central Railway elected by this Assembly to serve on the Committee for the above period."

The motion was adopted.

మిస్టర్ స్పీకర్:—దీనిని గురించి కూడా అదే rider ను add చేసి—ఇద్దరు కావాలని వ్రాయండి. ఇది అందరు ఏకగ్రీవంగా అంగీకరించారు. దీనికి కూడా 2-11-57 న 3 గంటలకు nomination papers దాఖలు చేయవలసినదిగా నిర్ణయిస్తున్నాను. ఒకరికంటె ఎక్కువవుంటే తరువాత polling కు time నిర్ణయిస్తాను.

The poll shall not be by single transferable vote put by direct election.

## Statement by Sri P. Sundarayya re: non-participation in the Government Tea-Party on 1-11-1957.

శ్రీ పి. సుందరయ్య:—అధ్యక్షా, మొన్నటి దినమున మన శాసన సభలో జరిగిన దానిమీద మీ అనుమతితో నేను ఒక ప్రకటన చేస్తున్నాను.

అధ్యక్షా, శాసన సభ్యుడు అయిన శ్రీ మందపాటి నాగిరెడ్డిగారి యెడల రాచేపల్లి పోలీసు సబ్-ఇన్‌స్పెక్టర్ ప్రవర్తించిన పద్ధతి శాసన సభ్యుల గౌరవానికి, శాసన సభాధ్యక్షుని గౌరవానికి కూడా భంగకరంగా ఉన్నదని, శాసన సభహక్కుల కమిటీ దానిని గురించి విచారణ చేయాలని ప్రతిపాదనపై ముఖ్యమంత్రిగారి భాషణ గాయముపై కారము చల్లినట్లైనది. ఆ పోలీసు

ఉద్యోగి తన కర్తవ్యాన్ని నెరవేర్చాడని, దానికి ఆయనను అభినందిస్తున్నానని, అలాచేయక రాష్ట్రపతి సందర్శనం కోసం ఎడికాడ స్పెషల్ ప్లాట్‌ఫారంపైకి పోనిచ్చివుంటే ఆ ఉద్యోగిపై కఠినచర్య తీసుకోవలసి వచ్చేదనీ మంత్రిగారు అనడం తమ ప్రభుత్వోద్యోగి చర్యను ఎట్లా అయినా సమర్థించుకోవడమూ తప్ప మరేమీకాదు. అంతేకాక, శాసన సభ్యులు చెప్పిన మాటలు కల్పితాలని త్రోసిపుచ్చడం శాసనసభ్యుల యెడల ప్రభుత్వోద్యోగులు అలక్ష్యంగానూ, అక్రమంగానూ ప్రవర్తించడానికి ప్రభుత్వం మరింత చేయూతనిస్తున్నది. ఇట్టి పరిస్థితులలో ప్రజల యెడల మేము మా బాధ్యతలను నెరవేర్చడం మరింత కష్టతరమవుతుంది. ముఖ్యమంత్రిగారి భాషణలో రాష్ట్రపతి, ప్రధాని తదితర ప్రభుత్వ అధినేతలను సందర్శించడానికి వారితో వీరులం, శూరులం, విక్రమార్కులం అని పరిచయం చేయించుకోడానికి శాసన సభ్యులమైన మేము తహతహపడుతూ వారి సౌకర్యాలు, భద్రతలు వేనినీ లక్ష్యంచేయని వారుగా చిత్రించడం మరింత శోచనీయం. మేము ప్రభుత్వాధినేతలు వచ్చినప్పుడు సందర్శించడానికి వెళ్ళి, వారు ఏర్పాటుచేసే, లేదా వారి గౌరవార్థం ఏర్పాటు చేయబడే విందులలో, వినోదాలలో పాల్గొనడం మా బాధ్యతలలో ఒకటియని, అది ఒక గౌరవ సాంప్రదాయమని తలచి వెడుతున్నామేకాని ప్రభుత్వాధినేతలకూ, మాకూ నేడు వున్న అంతరువులను మరచి వారితోపాటు మేమూ గొప్పవారమని చాటుకోడానికి కాదని మంత్రిగారు తెలుసుకోవలసినదని మేము సవినయంగా కోరుతున్నాము.

ఈ విషయాన్ని ప్రభుత్వాధినేతల దృష్టికీ, ప్రజల దృష్టికి సుస్పష్టంగా తీసుకురావడానికి మా ఆత్మగౌరవాన్ని కాపాడుకోడానికిగాను, ప్రభుత్వం రేపు ఏర్పాటు చేస్తున్న గవర్నరుగారి విందులాంటి వాటిల్లో పాల్గొనడంలేదని తెలియచేయుచున్నాను. శాసనసభ్యులుగా, ప్రజా ప్రతినిధులుగా మా హక్కులు, గౌరవ ప్రతిపత్తులు కాపాడుకోడానికి మాకు మరోమార్గం లేకుండా పోయినందున ఈచర్య తీసుకోవలసి వచ్చినందుకు విచారిస్తున్నాము.

మిస్టర్ స్పీకర్ :—ఎవరితరఫున ?

శ్రీ పి. సుందరయ్య :— P.D.F.–Communist Party తరఫున మేముచేసే ప్రకటన ఇది. ఇతర ప్రతిపక్ష సభ్యులు కూడా దీనితో అంగీకరిస్తారని మా ఆశ.

ముఖ్య మంత్రి (శ్రీ ఎన్. సంజీవరెడ్డి) :—అధ్యక్షా, దీని విషయమై నేను చెప్పగలిగిందేమీ లేదు. ఏ రూలు ననుసరించి ఈ statement చేశారో నాకు తెలియదు. ఈవిధంగా ఎప్పుడు పడితే అప్పుడు లేచి statement చేసే అవకాశం ప్రత్యేకంగా ఉన్నట్లున్నది.

శ్రీ పి. సుందరయ్య :—శాసన సభలో ఏదైనా జరిగినప్పుడు దానికి సంబంధించి explanation గా అధ్యక్షుని అనుమతితో ప్రకటన చేయడానికి రూలు ఉన్నది. అధ్యక్షులు అనుమతి ఇచ్చారు కాబట్టి చేశాము.

మిస్టర్ స్పీకర్ :—రేపు గవర్నరుగారి విందుకు రాము అంటారు.

*శ్రీ యన్. సంజీవరెడ్డి :—అధ్యక్షా, నేను చెప్పగలిగినది ఏమీ లేదు. ఇందులో నా పాయింట్ ఆఫ్ వ్యూ అర్థం చేసుకోలేదే అనే విచారాన్ని ప్రకటించడం తప్ప నేను చెప్పగలిగినది

ఏమీ లేదు. పెద్దలు వచ్చినప్పుడు వారిని ఎం. ఎల్. ఏ. లు కలుసుకొనుటకు కావలసిన ఏర్పాటు చేస్తున్నాము. రాష్ట్రపతి వచ్చినప్పుడు ఒకరు రాగా ... దగ్గర వారిని కలుసుకొన్నాము. టీపార్టీలో పాల్గొన్నాము. వారి వెంట ... తిరిగాము. ... శాసనసభ్యులను గౌరవించి ఇన్విటేషన్ చేసినాము. ... కాక వారిని ఎక్కడనో కలుసుకోవాలంటే ఇదేమి న్యాయమో ... ఏర్పాట్లు చేయకపోతే, వారికి ... పోతే. ... వారికి ఏమీ ... శాసనసభ్యులను ... అధికారులు. ... నేను అంగీకరిస్తాను. అటువంటి ఏర్పాట్లు చేసిన ... శాసనసభ్యులు రావడానికి ఏర్పాట్లు చేసిన తరువాత ఆక్షేపించటము న్యాయము కాదు. రాష్ట్రపతి ... కూర్చోడానికి. ... రావడానికి ... ఏర్పాట్లు చేశాము. రాష్ట్రపతి దగ్గరగా కూర్చున్నాము. ఉత్సాహంగా ... చెప్పుకున్నాము. శ్రీ గోపాలకృష్ణయ్యగారు ఒప్పుకుంటారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి):—నేను రాలేదు. నాకు ఇన్విటేషను రాలేదు.

శ్రీ యం. నాగిరెడ్డి:—నాకుకూడా యిన్విటేషన్ రాలేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—అక్కడకు వచ్చిన వారి విషయమే చెప్పాను. రాష్ట్రపతి పోతున్నారని ఎవరికీ ఇన్విటేషనులు పంపరు. రాష్ట్రపతి పోతున్నారు, రైలులో కలుసుకోండి అని ఇన్విటేషన్లు పంపరు. అది ఆచారం కాదు. స్టేట్ ఫంక్షన్ ఉంటే ఇన్విటేషను పంపుతారు. ఇన్విటేషను పంపక పోయినా స్టేషను దగ్గరకు వస్తున్నాము. రైలులో పోయుంటే ఎక్కడికని ఇన్విటేషను పంపేది. రైలులో పోతున్నారు. మాచర్ల స్టేషనులో వారు దిగారు. పల్నాడు సభ్యులు శ్రీ బాపయ్యగారు వచ్చారు.

శ్రీ యం. నాగిరెడ్డి:—మాచర్లకు వచ్చినా ఆ సబ్–ఇన్‌స్పెక్టరు మీకు ఇన్విటేషను లేదు కనుక రావద్దని అంటే మేము చేయగలిగినది ఏమీ లేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—ఎక్కడయినా అంతే—ఇప్పుడు అది తప్పుగా భావించడంలేదు. వాటరింగు స్టేషనులో గాని మరొక్కచోటనో రైలు నిలచివున్నప్పుడు నేను చూడాలి అంటే అంగీకరించడానికి అక్కడ ఉద్యోగస్థులకు అధికారం ఏమిటి. వారు అలవ్ చేస్తే ఎంత ఇన్‌డిసిప్లినుకు దారితీస్తుందో ఆలోచించ గోరుతాను. ఆ విధంగా మేము ఉత్తరువును జారీచేస్తే ఎంత ప్రమాదకరమో ఆలోచించక పోవడం విచారకరం అని మనవి చేస్తున్నాను. శాసనసభ్యులను అగౌరవ పరచాలనే ఉద్దేశం మాకు లేదు. అలాంటి స్టేటుమెంటును నేను అంగీకరించను. నీవు చేసినది తప్పు అని పోలీసు ఉద్యోగస్థుని అంటే, రేపు ప్రొద్దున ఎవరువచ్చినా ఎలవ్ చేస్తే, అది ఎంత ప్రమాదానికి దారితీస్తుందో ఆలోచించుకోమని చెబుతున్నాను. నేను దానిని గురించి చర్చించ దలచుకోలేదు. అలాంటి ఇన్‌డిసిప్లినును మనం ప్రోత్సహిస్తే ఏమవుతుందో గమనించాలి. మనము అతనికి ఒక ఉత్తరువు నిచ్చాము. నీవు అక్కడకు ఎవ్వరిని రానివ్వవద్దు అని ఆదేశించాము. నీ డ్యూటీస్ ఇవి అని చెప్పాము. ఆ పరిస్థితులలో తన ఇష్టం వచ్చినట్లు తానే చర్య పుచ్చుకోటానికి ఒక సబ్–ఇనస్పెక్టరుకు అధికారం ఇచ్చినట్లయితే ప్రభుత్వాన్ని ఎట్లా నడపగలం? ఉద్యో

గస్థులలో డిసిప్లిన్ వుంటుందా ? చూడటానికి వచ్చేవారు శ్రీ నాగిరెడ్డిగారు కాకపోవచ్చు. ఇంకొకరు కావచ్చు. ప్రమాదానికి దారి తీసినప్పుడు "నా డిస్క్రిషన్ ఉపయోగించాను; మీరు శాసనసభలో ఈ విధంగా చెప్పారు. నా ఇష్టం వచ్చినట్లు వదల వచ్చుననే అధికారం నాకు ఇచ్చారు. కాబట్టి నేను వదలినాను. వాడు పోయి ఏదో దుర్మార్గం చేశాడు (ఇతరులెవరైనా వచ్చినప్పుడు శాసనసభ్యులు కాపోవచ్చు), నా తప్పేమి" అనవచ్చు. ఈ దేశంలో అందరినీ మనం ఆ రకంగా చెప్పలేము. శాసనసభ్యులు పెద్దమనుష్యులే కావచ్చు. అయితే కొందరు ఇతరులు ఈ అధికారాన్ని మిస్‌యూజ్ చేయవచ్చు. కాబట్టి అంత లిబర్టీ, డిస్క్రిషన్ ఆ పోలీసు ఉద్యోగి ఉపయోగించి పెద్దలు వచ్చినప్పుడు—నెహ్రూగారు కాని, రాజేంద్రబాబుగారు గాని వచ్చినప్పుడు—ఏదో రైల్వే స్టేషనులోగాని, వాటరింగ్ స్టేషనులోగాని, లేక మరేదో కారణం వల్ల గాని మధ్యలో స్టేషనులో రైలు నిలువ వచ్చు. అక్కడకు ప్రజాసమూహము రావచ్చు. కాని అది కొంచెం లిమిటెడ్ స్కేల్ వుంటుంది. జవహర్‌లాల్ నెహ్రూ వచ్చినప్పుడు పబ్లిక మీటింగు పెడతాము. మంత్రులు కూడా క్రిందనే కూర్చోవాలి. నేను మంత్రిని కాబట్టి నేను పైకి పోతాను అనడానికి వీలు లేదు. నెహ్రూగారి డయాస్‌పైన ఒకటో రెండో సీట్లు ఏర్పాట్లు చేస్తారు. మంత్రులయినా, శాసనసభ్యులయినా 20 గజాల తరువాతనే ఒక పద్ధతి ప్రకారం కూర్చోవాలి. ఆ పద్ధతిని అధికమించి నేను మంత్రిని కాబట్టి అక్కడనే డయాస్ మీదికి పోవాలి అని మంత్రికూడా డిసిప్లినును బ్రేక్ చేసి నేను డయాస్ మీదకు పోతాను అని మొదలు పెడితే ఏమంటారు ఉద్యోగస్థులు? "నేను మంత్రిని, నేను క్రింద కూర్చోవాలా, నేను dais మీదికి రావాలి, జవహర్‌లాల్ నెహ్రూగారి దగ్గరనే కూర్చోవాలి" అని అందరు పోను మొదలు పెడితే ఎలా అవుతాడు. ఆ అఫిషియల్ ఇలాంటివన్నీ గమనించి మనమే చూసుకోవాలి కాని. మనమే హద్దులకు లోబడి ఉండాలి కాని, ఎవరినో నిందించాడు సంజీవరెడ్డి అంటే విచారాన్ని ప్రకటించడం తప్ప నేను చేయగలిగింది లేదు. నన్ను సరిగా అర్థం చేసుకోలేదు. అర్థం చేసుకోకపోవడం మరీ విచారకరం. అంతకన్న నేను చెప్పగలిగేది ఏమీ లేదు.

*Mr. Speaker:* I have allowed it in my general discretion. So the hon. Member has made a statement. I do not want to allow any more discussion. He says that he would not hereafter attend any functions, the Governor's function, etc.

*Dr. B. Gopala Reddi:* He did not say that he would not attend any Governmental function; it is only for tomorrow's Governor's function.

శ్రీ వి. నరశింగరావు:—అధ్యక్షా, మొన్నటిరోజున నాగిరెడ్డిగారు ఒక ప్రివిలేజ్ మోషన్ తీసుకొని వచ్చారు. ఆ మోషన్‌ను మీరు డిస్‌అలవ్ చేశారు. దానిని మేము అంగీకరించాము. కాని ఆ మోషన్‌ను తెచ్చిన సందర్భంలో ముఖ్యమంత్రి గారు మాట్లాడిన దానికి నిరసన తెలియ చేయకుండుటకు వీలులేదు.

శ్రీ ఎస్. సంజీవరెడ్డి :—ఏ రూల్ క్రింద నిరసన తెలుపుతున్నారో చెబితే కనీసం ఆ రూల్ ప్రకారం తిట్టారని సంతోషిస్తాము.

శ్రీ పి. నరసింగరావు :—ప్రెసిడెంటుగారు వచ్చినప్పుడు వారికి రక్షణ చూపవలెనని ఒకటే. ఆతృత ఎవరికీ కూడా లేదు.

మిస్టర్ స్పీకర్ :—శ్రీ సుందరయ్యగారితో మేము కూడా ఒక్కడిమిస్తాము. లేదు. అని చెప్పే వరకే తమకు అవకాశమిస్తాము.

శ్రీ పి. సుందరయ్య :—వారి ఇష్టప్రకారం వారు చేస్తారు. నా పార్టీ చెప్పేవి కనుక వారు చేయాలని ఏమీ లేదు.

శ్రీ పి. నరసింగరావు :—వారు చెప్పినదానితో నాకు సంబంధము లేదు.

శ్రీ కె. విజయ భాస్కరరెడ్డి (ఎమ్మిగనూరు—జనరలు):— అధ్యక్షా, మీరు ఒక పర్యాయం రూలింగు ఇచ్చారు. దానిని కాదని మరల ఈ విషయమై మాట్లాడ వచ్చునా?

శ్రీ పి. నరసింగరావు :—ముఖ్యమంత్రిగారు ఏ విధముగా సమాధానం చెప్పారో దానికి మా నిరసన తెలుపుతున్నాను. ఆ విధముగా సమాధానం చెప్పడంతో "మీరులు, నారులు, మీరెందుకు పోయారు" అనే విధంగా చెప్పడం సభ్యుల గౌరవానికి భంగం కాబట్టి నిరసనగా మేము కూడా రేపు సాయంకాలం గవర్నరుగారు ఇస్తున్న తేనీటి విందులో పాల్గొనడం లేదు.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య :—అధ్యక్షా,...............

మిస్టర్ స్పీకర్ :—లోక్‌సభలో ఒక పద్ధతి వున్నది. ఒక పార్టీ అనేదానికి మొత్తం సభలో ఒక పద్ధతి వున్నది. ఒకపార్టీ అనే దానికి మొత్తం సభలో కోరం వుండటానికి గల సంఖ్య ఉండాలి. మీరు 9 మంది మాత్రమే ఉన్నారు. మీరో వారో వ్యక్తులుగా మాత్రమే వచ్చారు. మీరు ఇన్‌డివిడ్యుయల్‌గా చెబితే చెప్పవచ్చును గాని, అందరి తరఫున...............

శ్రీ పి. సుందరయ్య :—లోక్‌సభలో కోరం సంఖ్యగల వాటిని పార్టీలుగా గుర్తించినా, యీనాడు ప్రతిపక్షంలో ఉన్న ఏపార్టీకి ఆ సంఖ్య లేదు. వాటిని గ్రూపులుగా యీనాడు గుర్తిస్తున్నారు. పార్లమెంటులో 500 మంది సభ్యులు వుంటే, దాని కోరం సంఖ్య 50 వుంటుంది. అంతమంది సభ్యులుగల ప్రతిపక్షంలేదు. అందువల్ల ఆ సంఖ్యతో నిమిత్తం లేకుండా, 15 మంది ఉన్నా, 20 మంది వున్నా వారిని గ్రూపులుగా గుర్తించడం జరుగుతున్నది. కాబట్టి శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారిని కూడా వారి తరఫున చెప్పనివ్వగోరుతాను. అధ్యక్షులు యీ పద్ధతిని ఆమోదించారు. ప్రత్యేకమైన సిద్ధాంతాల మీద కాకుండా వ్యక్తులుగా, స్వతంత్రులుగా ఎన్నికైనవారు ఒక పార్టీగా ఉండడం ఇదివరకే అంగీకరింపబడినవని మనవి చేస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—అధ్యక్షా, ఈ తొమ్మిదిమంది కలిగినటువంటి గ్రూపు.

మిస్టర్ స్పీకర్ :—అది అయిపోయింది. I am not going to allow further discussion. ఏ రూలు క్రింద లేకుండా discussion allow చేసినప్పుడు, ఎప్పుడు నడిచే అప్పుడు ఆపటానికి నాకు discretion ఉన్నది. సభ్యులు చెప్పినవి మళ్ళీ చెప్పటం

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా,

| | | |
|---|---|---|
| Demand IX—Heads of State, Ministers and Headquarters Staff | లో | 1.8 |
| Demand XXVI—Civil Works | లో | 56,57 |
| Demand XXVII—Electricity | లో | 67,85,93,95 |
| Demand XXXVII—Capital Outlay on Irrigation .. | లో | 72,87 |

ఈ నెంబర్లుగల కట్ మోషన్స్ మాత్రం మేము మువ్ చేస్తాము. ఈ నాలుగు డిమాండ్ల మీద మాత్రమే కట్ మోషన్స్ మువ్ చేస్తాము. ఈ కట్ మోషన్స్ వివిధ పార్టీల ప్రతినిధుల పేరుమీద ఉన్నాయి. ఈ నాలుగు డిమాండ్లను కలిపి తీసుకొన్నా, లేక మంత్రిగారు చెప్పి నట్లు విడివిడిగా తీసుకొన్నా, నాకు అభ్యంతరం లేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—ఒక డిమాండ్ తర్వాత ఒక డిమాండ్ తీసుకొందాము.

శ్రీ పి. సుందరయ్య :—నాకు అభ్యంతరం లేదు. కాని సివిల్ వర్క్సుకు సంబంధించిన డిమాండ్ మాత్రం ఆఖర్యంగా తీసుకోండి.

మిస్టర్ స్పీకర్:—అయితే ఇప్పుడు డిమాండ్ IX మీద ఉన్న కట్ మోషన్స్ తీసుకొందాము.

*Sri P. Sundarayya:* I beg to move:

"To reduce the allotment of Rs. 1,00,000 for Heads of State, Ministers and Headquarters Staff by Rs. 100".

(To criticise the compulsory collection of Small Savings especially from small income persons).

*Mr. Speaker:* Motion moved.

*Sri G. Ganga Reddy (Mudhole):* I beg to move:

"To reduce the allotment of Rs. 1,00,000 for Heads of State, Ministers and Headquarters Staff by Rs. 100".

(To criticise the action of the Government in carrying out the small savings scheme in a compulsory manner inspite of the awareness of the hardships of the public in these famine days).

*Mr. Speaker:* Motion moved.

ఆ సందర్భంలో మంత్రిగారి దృష్టి కి తీసుకురావటం జరిగింది. మన స్టేటులో ఈ స్మాల్ సేవింగ్స్ విషయం, చివరకు, ఒక నిర్బంధ పన్నులాగా తయారైంది అన్నసంగతి వివిధ పార్టీ సభ్యులు చెప్పిన ఉపన్యాసాలవల్ల స్పష్టమైనది. మంత్రిగారు అసలు వాస్తవంగా ఏమి జురుగుతున్నది అనేటటు వంటి విషయం ఆలోచించటంకంటే, ఏదో సమాధానం చెప్పటమే బాధ్యతగా పెట్టుకొని, అక్కడ జరిగినవన్నీ సమర్ధిస్తూ చెప్పటం చాలా విచారకరము. అసలు ఎవరో అక్కడ జరుగు తున్నటువంటి కార్యక్రమాలను తూట్లు పొడిచేటటువంటి వాళ్ళుగా ఉన్నట్లు (నేను అర్థం చేసుకొన్నంతవరకు) మంత్రిగారు సమాధానం చెప్పటం చాలా విచారకరమైన విషయము. బాధ్యతగల సభ్యులు, అన్ని పార్టీలవారూ ఈ విషయాన్ని ప్రభుత్వ దృష్టి కి తీసుకు వచ్చినప్పటికీ, స్మాల్ సేవింగ్స్‌ను నిర్బంధంగా వసూలు చేయటానికి వీల్లేదని స్పష్టంగా మంత్రిగారు ప్రకటన చేయనందుకు నేను నా విచారాన్ని ప్రకటిస్తున్నాను. "స్మాల్ సేవింగ్స్‌ను ప్రజలు ప్రోత్స హించాలి. ప్రభుత్వానికి సహాయం చేయండి. ఆరకంగా ఆ ఉద్యమాన్ని ప్రోత్సహించండి. ప్రోత్సహించకపోతే కనీసం దానిని భగ్నం చేయటానికైనా ప్రయత్నించకండి" అని మంత్రిగారు ఒక విజ్ఞప్తి చేశారు. నేను హుజూర్‌నగర్ నియోజక వర్గంనుంచి ఎన్నుకోబడిన సభ్యుడను. అక్కడ వాస్తవంగా ఏమి జరిగిందో తమద్వారా మంత్రిగారి దృష్టి కి తీసుకువస్తున్నాను. నల్గొండ జిల్లాకు కేటాయించిన స్మాల్ సేవింగ్స్ కోటాలో హుజూర్‌నగర్ తాలూకాకు 1 లక్ష 25 వేల రూపాయల కోటా నిర్ణయించి పంపారు. ఆ కోటాను పూర్తి చేయటంకోసం అక్కడి తహసీల్దారు మా అందరితో కూడా సంప్రదించారు. అక్కడవున్న అన్ని రాజకీయ పార్టీలవారి తోను సంప్రదించారు. వారిలో నేను కూడా ఒకడను. మా తాలూకా కోటా 125 వేలు ఏ పద్ధతిలో సేకరించాలి అన్న విషయంలో నేను కొన్ని కాంక్రీట్ సూచనలు చేశాను. "ఆ డబ్బును ఎలా పోగుచేయాలి, అక్కడ ఉన్న వాతావరణము ఏమిటి, అక్కడవున్న రైతాంగం యొక్క పరిస్థితి ఏమిటి, పంటల పరిస్థితి ఏమిటి"—మొదలైన వాటికి సంబంధించి కొన్ని సూచనలు వారిముందు పెట్టాను. అందుకు వారు నామీద ఒక ప్రత్యేక బాధ్యత పెట్టారు. "నీవు ఇక్కడి నియోజకవర్గ సభ్యుడివి. నీవు పుట్టిన, నీ స్వంత ఊరికి నన్ను తీసుకువెళ్ళి ఏమీ నిర్బంధంలేకుండా, ఇచ్ఛికంగా ఇందులో ఎంత చేయిస్తావో చేయించు. అందుకు ఏ పద్ధతులు అనుసరించాలో నాకు కొన్ని సూచనలు ఇవ్వవలసింది" అని ఆ తహసీల్దారుగారు

దానికి ఆధారాలు లేవు. తీసుకున్న సొమ్ముకు అయినా ఈ నాటివరకు certificates పంపలేదు. దీనికి ఉదాహరణలు కావాలంటే, ఇలాంటివి సుమారు 15 గ్రామాలు ఉన్నవి. పేర్లు ఇవ్వగలను. ఈ పద్ధతి తప్పు అని చెబుతూ, ఇది సరైన పద్ధతిలో జరగటానికి నేను అయిదారు సూచనలు చేశాను. ఆ సూచనలు మంత్రిగారికి, జిల్లా కలెక్టరుగారికి పంపించాను. తహసీల్దారుగారితో నేను స్వయముగా ఈ సూచనలను గురించి చర్చించానుకాని నేను చేసిన సూచనలు యింతవరకు ఎవరుకూడ పాటించడము లేదు.

డాక్టరు బి గోపాలరెడ్డి :—ఆ సూచనలు ఏమిటో చెప్పండి.

శ్రీ డి నరసయ్య :—నేను చేసిన సూచనలు యింతవరకు అంగీకరించినట్లు, అమలు జరుపుతున్నట్లు కనబడదు. వాటికి ప్రాముఖ్యత యివ్వనేలేదు. నేను చేసిన సూచనలు మంచివో, చెడ్డవో ఏసంగతి కూడ చెప్పకుండ ఉద్యమమును తూట్లు పొడుస్తున్నారనీ అన్యాయముగ remark చేయుటము న్యాయముకాదు. ఈ రిమార్కు అక్కడ తహశీలుదారుగారు నాతో మాట్లాడుతూ అన్నారు. అసలు ఇప్పుడు వసూలు చేసే పదతి సరైనదీ కాదు. తప్పు విధానమని అంటున్నారు. తహశీలుదారుకు ఒక కోటా నిర్ణయించి, "యీ కోటాకువచ్చే సొమ్మును నీవే వసూలు చేయాలి" అని నిర్ణయము చేస్తే, ఆయనకు ఉన్న అధికార హోదాలో అక్కడికి పోయి ఆ రకంగా ఈ నిర్బంధ విధానము గ్రామాధికార్ల ద్వారా అవలంభిస్తే దాని మీదట ఆ గ్రామాధికార్లు, భూస్వాములు, యింకా హెచ్చు డబ్బు యివ్వవలసిన వారు తప్పుకుని పోతున్నారని మనవి చేస్తున్నాను. ఇలాంటిదే నాకు ఒక రిపోర్టు కూడ వచ్చింది. ఈ సందర్భములో ఒక ఉదాహరణ చెబుతున్నాను. ఇదే వరంగల్ జిల్లాలో మొట్టమొదటి ప్రారంభమైనది. తరువాత ఖమ్మం, నల్లగొండ జిల్లాలు అక్కడ నేను స్వయముగ చూచి వచ్చాను గనుక చెప్పగలుగు తున్నాను. Abkari contract లో పాటలు వచ్చినవి. ఆ contract అందరు పాడుతున్నారు. ఆ పాటలో పదోవ వంతు small savings క్రింద వారివద్ద వసూలు చేశారు. ఇది ముందుగా వరంగల్ జిల్లా కలెక్టరుగారు ఖమ్మంజిల్లా కలెక్టరుగారు యీ విధంగా ప్రారంభించి వసూలు చేశారని చెప్పి నల్లగొండ జిల్లాలో ప్రచారము చేసి నల్లగొండ జిల్లా కలెక్టరుగారు వసూలు చేశారు. పోనీయండి, కంట్రాక్టరువద్ద వసూలు చేస్తే మాకేమి అభ్యంతరము వుండేదీ కాదు. ఆ కంట్రాక్టరు పేరు ఏమిటో? ఎవరు కంట్రాక్టుకు పాడుకున్నారో చెప్పండి. ఈ పేర్లు తీసుకు పెళ్ళి ఎవరైతే చెట్లు గీత గీసుకునే పేద కార్మికులు ఉన్నారో, ఎవరైతే కంట్రాక్టరుగా పొందుపరుస్తున్నారో, అలాంటివారిమీద ఫర్మానా చేసుకునే దానికి, దానికి సంబంధించిన ఒక్క కాగితము అయినా లేకుండా చేశారు. నిజస్థితి తెలుసుకోడానికి ఎన్నిసార్లు ఆఫీసుకు పెళ్ళి అడిగినాపో అన్ని రకముల పన్నులు యీ చేరుమీదనే పడుతున్నవి. ఇది చివరకు చూస్తే పేదవాళ్ళమీద పడుతున్నవి అమ్మకము పన్ను పోయి ఎవరిమీద్ద పడుతున్నదో, ఆ రకముగ యీ Small Savings Scheme క్రింద వసూలు చేసే సొమ్ము పడుతున్నది. ఎక్కడికక్కడే [illegible] చేశానని కలెక్టరుగారు అనుకొంటున్నారు. ఆ Collector [illegible]

వరంగల్లు జిల్లాలో చెన్నారావుపేట అనే వూరుంది. అక్కడ **Large Scale Bank** ను స్థాపించుకున్నారు. పేదరైతాంగానికి అప్పులభారం తగ్గించడానికి అక్కడ స్థానిక ప్రజలు, ప్రజా సేవకులు కలిసి కృషిచేసి యీ **Bank** ను స్థాపించుకున్నారు. ఆ సందర్భంలో అప్పులు మంజూరు చేయడానికి ఆ **Bank** ప్రతినిధులు తహసీల్దారు దగ్గరకు వెళ్ళితే అదీ మంజూరు చేయడానికి, "మూడువేల రూపాయలు **Small Savings Scheme** క్రింద మీరు యిస్తారా, లేదా ?" అని ఒత్తిడి పెడుతున్నారు. ఇది న్యాయంకాదని యెంత చెప్పినా వినేటట్లు లేరు. చివరకు గత్యంతరం లేక వరంగల్లు కలెక్టరు దగ్గర మొరపెట్టుకుని అక్కడ నుంచి అనుమతి తెచ్చుకున్నారు. దానిమీద తహసీల్దారుకు ఇంకా కోపంవచ్చింది. "నాకంటే పైవారి దగ్గరకు వెళ్ళి నామీద యీరకంగా తెచ్చావు. అందుచేత నీ పని యింకా ముంచుతాను" అంటున్నాడు. ఈ రకంగా ఏ ఆఫీసులో పని వుండి వెళ్ళినప్పటికీ ప్రతి సందర్భంలో యీ రకంగా పన్నులు వసూలు చేసే పద్ధతి దురదృష్టకరమైనది. **Small Savings Scheme** యొక్క ఉద్దేశ్యాన్ని భంగపరుస్తున్నది. **Small Savings**అంటే నా అభిప్రాయం యేమిటో కలెక్టరు గారికి ముఖ్యమంత్రిగారికి వ్రాశాను. నేను వ్రాసినదీ యేమిటంటే—"ఇది ఇచ్ఛికంగా యివ్వడానికి ప్రచారం జరగాలి. ప్రచారంవల్ల చక్కని అనుకూలవాతావరణం సృష్టించబడాలి, అని. అలాంటి వాతావరణం సృష్టించబడినప్పుడు పొదుపు చేసుకున్న వ్యక్తి నేరుగా పోస్టాఫీసులకు పోయి జమకట్టుకుని తన స్టాంపు తాను తెచ్చుకునే బాధ్యత వుండాలితప్ప యీ **Small Savings** అధికారుల చేతులలో పెట్టి దుర్వినియోగం చేయవద్దని నా మొట్టమొదటి మనవి. రెండోది ఈ **quota** పద్ధతి ఎవరైతే తాలూకాలో బాధ్యత తీసుకున్నారో వారు దానికోసం ఒక ఉద్యమం **(Campaign)** గా తీసుకుని పోత్సహించి, అందరికి చెప్పాలి. ప్రజలే ఎక్కడివారక్కడ పోస్టాఫీసులలో నేరుగా కట్టుకునే ఏర్పాటు చేయాలి. కాని తహసీల్దారు నిర్ణయించినట్టి కోటా ప్రకారం పటేలో, పట్వారియో, భూస్వామియో వసూలుచేసి అనామతుగా తెల్లకాగితంమీద రెండు ముక్కలు వ్రాసేటటువంటి పద్ధతి మాత్రం చాలా దురదృష్టకరమైనది. దీని మూలంగా అనేక ప్రభుత్వాలు అప్రతిష్టపాలైనాయి. వారిచ్చే డబ్బుకు గ్యారంటీ "లేదు, లేదు, లేదు" అని ప్రజలు అనేకసార్లు చెప్పుకుంటున్నారు. ఇదివరకు కూడా **sale society** లు అనే పేరుపెట్టి, యింకో పేరుపెట్టి గ్రామాధికారులు [illegible] వేరే వ్రాసుకున్నందువల్ల యివ్వాళ్ళ రశీదులతో అవివారి ఒక్కరి [illegible] రూపాయలు పేర్లు యిచ్చినటువంటి వాళ్ళంతా గంగలో కలిపివేయారు. [illegible] కరం పడుతున్నారు. ఈ బాధ్యత [illegible] చేయవలెను? [illegible] 20 [illegible] అని చెప్పి యిచ్చినా [illegible] **Small Savings** [illegible]

[illegible]

ఉద్యమంగురించి ప్రభుత్వంతో సహకరిస్తూ, అధికారులవల్ల ప్రజలకు కలిగే కష్టాలను వ్యక్తం చేశారు. ఈ పొదుపు ఉద్యమంలో తాము అక్కడక్కడ అనుభవించే కష్టాలను నేరుగా ప్రభుత్వం దృష్టికి తీసుకువచ్చి, వాటిని పరిష్కారంచేసే అవకాశాలున్నాయి. ఆ విధంగా కాకుండా ప్రభుత్వమే యీ కష్టాలను కల్పిస్తున్నది అనే 'అపభ్రంశ' ప్రభుత్వంపైన మంత్రివర్గంపైన పెట్టి ప్రభుత్వ విధానాన్ని విమర్శించేటటువంటి పద్ధతి మంచిదికాదనుకుంటాను. పొదుపు ఉద్యమం చాలా మంచిదని వారు అంగీకరిస్తున్నారు. ఈ పొదుపు ఉద్యమాన్ని గురించి గౌరవనీయులైన శాసనసభ్యులు, మహిళాసంఘాల ద్వారాగాని యితర ప్రజా సంక్షేమ సంఘాల ద్వారాగాని ప్రచారంచేసి తొమ్మిది కోట్ల రూపాయలు ప్రభుత్వానికి లభింపచేసినట్లయితే ప్రభుత్వం తాను తలపెట్టిన అభివృద్ధి ప్రణాళికలు జయప్రదంగా అమలు జరిపించి—ప్రజానీకానికి యివ్వవలసిన సదుపాయములను సకాలంలో అందజేయగలదు. ఈ పొదుపు ఉద్యమానికి నలుమూలల నుంచి అన్ని వర్గాలద్వారా సహకారం లభిస్తుందనీ, తద్వారా మనం అనుకున్నటువంటి 9 కోట్ల రూపాయలు సకాలంలో అందుతుందని ఆశిస్తూ ప్రజానీకం దీనికి తోడ్పడాలని తమ ద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను. తరువాత అన్ని డిమాండ్ల పైన కోత తీర్మానాలను ప్రతిపక్షం వారు యితరులు కొంతమంది యిచ్చారు. వాటన్నిటిపైనా వివరంగా చెప్పడానికి కాలం చాలదు. కనుక రెండుమూడు సలహాలు మాత్రం సూచన ప్రాయంగా ప్రభుత్వం దృష్టికి తీసుకుని వచ్చి విరమించదలచుకున్నాను. రాయలసీమలో క్షామం అప్పుడప్పుడు వస్తున్నది. వచ్చినప్పుడల్లా రోడ్లు మరమ్మతు చేస్తున్నారు. 20, 30 సంవత్సరాలనుంచి రోడ్లపైన వేసిన కంకర, గరుసు అట్లనే నిలచిపోయాయి. రెండు మూడు సంవత్సరాలలోనే ఆ పనులను సంపూర్ణంగా పూర్తి చేయలేమని నాకు తెలుసును. కాని ఆ రోడ్లు మరమ్మతుకు ఒక పథకంవేసి, కనీసం అయిదు సంవత్సరాలలోనో 10 సంవత్సరాలలోనో కొన్ని రోడ్లనైనా తీసుకుని వాటిని మరమ్మత్తు చేయించి, రవాణా సౌకర్యాలు ఏర్పాటు చేస్తే బాగుంటుందని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. విద్యుచ్ఛక్తి విషయంలో కోటి రూపాయలు తగ్గించాలని కేంద్ర ప్రభుత్వంనుంచి సలహా వచ్చిందని మనకు తెలుసును. అయితే పల్లెటూర్లలో వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన పనులకు మాత్రం తగ్గించకుండా వేరే పనులకు తగ్గించి, పల్లెటూరి ప్రాంతాలలో బావుల క్రింద సేద్యం కొరకు రైతాంగానికి విద్యుచ్ఛక్తి సరఫరాచేసి వెంటనే అధిక ఉత్పత్తికి తోడ్పడాలని నేను ప్రభుత్వమునకు మనవిచేస్తున్నాను. ఇంక, పశువుల ఆసుపత్రులకు కేటాయించిన కొన్ని పద్దులున్నాయి. పశువులను ఆసుపత్రుల విషయమై ప్రభుత్వం, పశువుల అభివృద్ధికి వారి రోగ నివారణకి పథకాలువేసి, ఏర్పాట్లు చేస్తున్నందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసిన అవసరం వున్నది. ఆ పథకంక్రింద యింకా ఎక్కువ శ్రద్ధ తీసుకుని పశువుల యొక్క రోగ నివారణకు కావలసిన చర్యలు తీసుకోవాలి.

శ్రీ జి. గంగారెడ్డి :—అన్ని విషయాలను గురించి మాట్లాడడానికి వారికే అనుమతి వున్నదా?

మిస్టర్ స్పీకర్ :—అందరూ కూడా వారికిచ్చిన పది నిముషాలలో మాట్లాడవచ్చు. I must allow every hon. Member full freedom of speech. ఏదైనా మాట్లాడండి కాని relevant గా వుండాలి.

శ్రీ పి. సుందరయ్య:—ఇందాక కాంగ్రెసుపార్టీ కార్యదర్శిగారు ఏ రూలు క్రింద statement చేశారన్నారు. ఇప్పుడు కొన్ని రూల్సు క్రింద చర్చ జరుపుతున్నాము. ఇందాక రూల్సు ఎంతో ఖచ్చితంగా అమలు జరపాలన్న కాంగ్రెసు పార్టీ కార్యదర్శి యిప్పుడు ఏ రూల్సు ప్రకారం వారి సభ్యులు మాట్లాడుతున్నారో కాస్త ఆలోచిస్తారు? అని మీ దృష్టికి తీసుకువస్తున్నాను. మీకు సర్వ అధికారాలున్నాయని మాకు తెలుసును.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—మీరు ఏది చెప్పినా నేము అంగీకరిస్తాము.

శ్రీ ఎస్. నారాయణప్ప:—అధ్యక్షా, తమరు ఇచ్చినటువంటి సలహాలను అనుసరించే ఏవో కొన్ని సలహాలు ప్రభుత్వానికి చెప్పదలచి ఆ తలంపుతోనే ఈ ప్రసంగం చేయవలసిన అవసరం వచ్చింది. అందువల్ల ఆ విషయాన్ని ప్రభుత్వ దృషికి తమ ద్వారా తీసుకురావడమైనది. తరువాత industries విషయంలో కొన్ని కోత తీర్మానాలు పంపించారు. మన రాష్ట్రములో పరిశ్రమలు చాలా తక్కువ అని అందరికీ తెలుసును. దానికి కావలసిన allotments అన్నిటినీ బలపరుస్తున్నాను. ఇంకా ఎక్కువ allotments కావాలి. చేతి పరిశ్రమలకు allotments ఇంకా ఎక్కువ చేయడానికి ప్రభుత్వం పూనుకుంటే ఎక్కువగా నిరుద్యోగ సమస్య నివారణ అవుతుందని నా విశ్వాసం. ఆ ప్రయత్నం చేయాలని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ కె. రాజమల్లు (సిరిపూరు—జనరల్):—అధ్యక్షా, చిన్న మొత్తపు పొదుపు ఉద్యమము ద్వారా 9,25,00,000 రూపాయలు వసూలుచేసి, బడ్జెటులోటు తీర్చాలని మన ప్రభుత్వము తలపెట్టింది. ఈ పొదుపు ఉద్యమాన్ని విజయవంతముగా సాగించటములో తమకు సహకరించవలసినదిగా కార్మికులను, కార్మిక నాయకులను ఆర్థిక మంత్రిగారు కోరినారు. ఇప్పటికే ప్రజలపై అనేక విధములైన భారములు ఉన్నప్పటికీ, ఈ పొదుపు ఉద్యమము ద్వారా డబ్బును వసూలుచేయటం జరుగుతున్నది. అయినా మనముందు ఒక కార్యక్రమము ఉన్నది కాబట్టి ఈ విధముగా డబ్బును వసూలు చేయక తప్పదు. ఈ పొదుపు ఉద్యమాన్ని నిరుత్సాహ పర్చటం కూడా మంచిదికాదు. వివిధ డిపార్టుమెంటులకు డెవలప్‌మెంటు పనులు చేయటానికి కేటాయించిన డబ్బు సరిగా ఎకానమీ చేసి ఖర్చు పెట్టేటట్లుచూస్తే ప్రజలమీద ఈ భారంవేసే అవకాశం ఉండదు. ప్రజలను, కార్మికులను సహాయము చేయుమని కోరేబదులు, గవర్నమెంటు అధికారులను, కలెక్టరులను, సెక్రెటరీలను, కేటాయించిన డబ్బు ఇంకా ఎవరైతే వాడుతున్నారో, వారందరిని సహాయము చేయమని అడిగితే మంచిది. కేటాయించిన డబ్బు వారు వృథాగా ఖర్చు పెడుతున్నట్లు తెలుస్తోంది. వివిధ మంత్రులకు డబ్బు కేటాయించిన తరువాత ఆయా డిపార్టుమెంటులలో ఏవిధముగా ఖర్చు అవుతున్నదో check చేయాలని ఆర్థిక మంత్రిగారికి చెబుతున్నాను. ఇది ఆర్థికమంత్రిగారికి కఠినమైన సమస్య. దానిమీద check చేయటం ఆ మంత్రులకు ఇష్టం లేకపోవచ్చు. ఇటువంటి పరిస్థితి కేంద్రములో దేశముఖ్ ఆర్థిక మంత్రిగా ఉన్నప్పుడు కలిగింది. అక్కడ కొన్ని అవకతవకలు జరిగాయి. కానిపర్సనల్ పద్ధతిలో మంత్రులు ఈ సొమ్మును ఖర్చు చేస్తున్నారా, లేదా, check చేయటం మంచిదని చెబుతున్నాను.

ఖర్చుకు డబ్బు వృథాగా ఖర్చుచేస్తున్నారు. ఇటువంటి ప్రారంభోత్సవ కార్యక్రమములకే తమ కాలమును వినియోగించక ఏ ఆఫీసులో పని ఏవిధంగా జరుగుతున్నదో, ప్రజలు ఏ ఏ కష్టములు పడుతున్నారో తెల్సుకొనటానికి వినియోగిస్తే మంచిది. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమమును కూడా మంత్రులు పంచుకొన్నారు. ప్రైమరీ స్కూలునుండి మిడిల్ స్కూలువరకు మంత్రులు, మిడిల్ స్కూలునుండి హైస్కూలువరకు ముఖ్యమంత్రి, ఆ పైవాటికి గవర్నరుగారో లేక కేంద్ర మంత్రియో వాటి ప్రారంభోత్సవాలకు రావటం జరుగుతోంది. ఇదేనా మనం చేయబోయే డెవలప్ మెంట్ వర్క్? అని నేను మంత్రులను అడుగుతున్నాను. ఇటువంటి అవకాశాలు ఎప్పుడు వస్తాయా? ఎప్పుడు దేనిని inaugurate చేద్దామా అని మంత్రులు చూస్తూవుంటారు. ఇతర దేశాలలో ముఖ్యంగా యూరపులో ఇటువంటి opening ceremonies లో మంత్రులు పాల్గొనరు. ఆ గ్రామములోవున్న పెద్దలో, లేక head masters ఆ ఉత్సవము చేస్తారు. కాని ఇక్కడ పాయిఖానాలను కూడా మంత్రులే open చేయాలి ఇది మంత్రులకు గౌరవముకాదు. ప్రతివారికీ ఉద్యోగాలు వచ్చేటట్లు ప్రతివారికి భూమి వచ్చేటట్లు చూడాలి. Opposition members చెప్పేది అంతా అబద్ధమనివారు అంటారు. వారు అలాచెప్పినా మాకు బాధలేదు. మేము చెప్పింది నిజమో, అబద్ధమో వారు తెల్సుకోవచ్చు. ముస్తాబై మోటారులో పోయే తెలుసుకోనవసరములేదు. మీర్ ఇస్మాయిల్ ఖాన్ మంత్రిగావున్న రోజుల్లో ఎక్కడైనా అవకతవకలుంటే మారు వేషములతో వెళ్ళి కనుక్కొనేవాడు. అది సిగ్గుకరమైన విషయముకాదు.

కార్మికుల గురించి ఎవరు మాట్లాడలేదు. కార్మికులకు సంబంధించిన వాడిని అవటంచేత నేను వారిగురించి కొద్దిగా మాట్లాడలేను. కార్మికులలోయున్న unity ని చెడగొట్టటానికి వారిలో dividing rule policy తీసుకవచ్చి తమ పార్టీ పాలిటిక్స్ క్రింద ఉపయోగించు కొంటున్నారు. కార్మికులను divide చేయటానికి పూనుకొనేవారు ఇప్పుడు కాకపోయినా ఇకముందైనా పశ్చాత్తాప పడకతప్పదు. దేశంలో ఏమూల ఏది జరుగుతున్నదో అంతా ఆలో చిస్తున్నారు. మంత్రి వర్గములో గ్రూపులున్నాయి. ఒక గ్రూపువారు చెప్పింది రెండవ గ్రూపు వారికి నచ్చదు. మేము అవకతవకలు చేస్తున్నామని చెబుతూ వారు చేస్తున్నారు. ఇటువంటి behaviour రజాకార్ల రాజ్యములోను, నైజాం రాజ్యములో కూడాలేదు. అప్పుడు వారు మాట్లాడేటప్పుడు పనులు చేసేటప్పుడు మంచిగా behave చేసేవారు. కాని ఇప్పుడు వీరు 'శేరుకు సవాసేరు' అయిపోయారు. మొన్న ఒక మంత్రిగారు ఒక ప్రశ్నకు సమాధానం ఇస్తూ జాగ్రఫీ చూచుకోమన్నారు. ఇది మంచి behaviour యేనా అని అడుగుతున్నాను. చెప్పటము చేతకాకపోతే, చెప్పేశక్తి లేకపోతే వేరే విధముగా సమాధానం ఇవ్వాలి. చివరిసారిగా ఆర్థిక మంత్రిగారికి ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. ఏ ఏ డిపార్టుమెంటుకు కేటాయించిన సొమ్ము ఏ ఏ విధంగా ఖర్చు అవుతున్నదీ check చేయాలి. అది ఇతర మంత్రులను కష్టపెట్టినప్పటికీ ఆర్థిక మంత్రి ఎలాగైనా check చేయాలని చెబుతూ ఇంతటితో ముగిస్తున్నాను.

శ్రీ యం. ఆర్. అప్పారావు (నూజివీడు) :—అధ్యక్షా, రెండవ పంచవర్ష ప్రణాళికలో మనం తీసుకొన్న కార్య క్రమాలలో ముఖ్యమైనది నాగార్జునసాగర్ ప్రాజెక్టు. ఇందులోని ఎడమవైపు కాలువ మెరక ప్రాంతాలకు నీరు సప్లయి చేస్తుంది. ఈ ఎడమ కాలవ మొదటి

దశలో 11 వేల క్యూసెక్కుల ప్రమాణంతో 140 మైళ్ళవరకు ప్రవహిస్తోంది. ఈ కాలవను తమ్మిలేరువరకూ పొడిగించాలని నాగార్జునసాగర్ ఎడమకాల్వ రైతుల తరఫున ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తి చేశాము. అందుకు మన ప్రభుత్వంవారు ఒప్పుకొని, దానిని పశ్చిమ గోదావరి జిల్లాలోని చింతలపూడివరకూ పొడిగించడానికి ఏర్పాటు చేశారు. అందుకు మేము ప్రభుత్వానికి కృతజ్ఞులమై ఉన్నాము ఇట్లా పొడుగు చేసినప్పుడు 11 వేల క్యూసెక్కులనుంచి 15 వేల క్యూసెక్కులవరకూ ప్రవాహాన్నభివృద్ధి చేయడానికి కావలసిన సొరంగాలను కూడా ఏర్పాటు చేశారు. మొదటి దశలో 108 మైళ్ళవరకూ త్రవ్వాలని ప్రభుత్వంవారు publish చేశారు. రెండవ దశలో 140 మైళ్ళవరకూ త్రవ్వాలని ఏర్పాటు చేసినట్లు తెలుస్తున్నది. కాని రెండవ దశలోనే 160 మైళ్లవరకూ పొడిగించాలని కోరుతున్నాము. అట్లా చేయక పోతే కృష్ణా జిల్లాలోని తిరువూరు, నూజివీడు తాలూకాలకుగాని, పశ్చిమ గోదావరి జిల్లాలోని చింతలపూడి తాలూకాకుగాని నీరు లభించడానికి అవకాశం లేదు. అవి చాలా వెనుకబడిన ప్రదేశాలు. వర్షాలు లేక 2, 3 సం॥ లు వరుసగా కూడా పంటలు పాడైపోతున్నాయి. ప్రజలు చాలా బాధలు పడుతున్నారు. రెండవ దశలో అయినా చింతలపూడివరకూ నీరు ప్రవహించే ఏర్పాటు చేయాలి. అట్లా చేస్తే అక్కడవుండే రైతులు betterment taxes యిచ్చుకోడానికి సిద్ధంగా వున్నారు. ఈ విషయమై ముఖ్యమంత్రిగారితోనూ, పి. డబ్ల్యు. డి. మంత్రిగారితోను చెప్పాము. వారు దానికి అనుకూలముగానే ఏర్పాటు చేస్తామంటున్నారు. రెండవ దశలో దీనిని 160 మైళ్ళవరకు పొడిగించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తమ్మిలేరు ప్రాజెక్టు ఉన్నది. ఈ తమ్మిలేరు పశ్చిమ గోదావరి జిల్లాలోని చింతలపూడి దగ్గరనుంచి కొల్లేరులోనికి పోతున్నది. ఈ తమ్మిలేరు క్రింద దాదాపు 12 కాలవలు కట్టి నీరు తీసుకొంటున్నారు. ఈ 12 కాలువల 10 వేల ఎకరాలు సాగవుతున్నవి. దీనిమీద dam నిర్మించినట్లయితే ఇంకా 16, 17 వేల ఎకరాలవరకూ సాగవడానికి అవకాశం ఉంది. అంతే కాకుండా బుడమేరు వరదను తగ్గించడానికి సావకాశం ఉంటుంది. ఈ మధ్య యింజనీరులు మంత్రులు అక్కడకు వచ్చి చూశారు. కేంద్ర ప్రభుత్వంవారు flood protection క్రింద యిచ్చే డబ్బులో దీనికొరకు దాదాపు కోటి రూపాయలు యిచ్చినట్లు తెలుస్తున్నది. దీనిని మనం వెంటనే అమలుచేసినట్లయితే కొల్లేరులో వచ్చే వరదలు తగ్గడమే కాకుండా కొత్తగా 16 వేల ఎకరాలు భూమిని వ్యవసాయంలోనికి తీసుకురావచ్చు. మునిగే భూమిని రైతులు యివ్వడానికి సిద్ధంగావున్నారు. దానివల్ల దాదాపు 5 వేల ఎకరాల భూమి మిగులుతుంది. దానిని యివ్వడానికి రైతులు తీర్మానం చేసుకున్నారు. కాబట్టి మనం దీనిని వెంటనే అమలు చేసినట్లయితే, వరదలనుండి రక్షింపబడటానికి, క్రొత్తగా కొంత భూమిని వ్యవసాయానికితెచ్చి ఆహార సమృద్ధికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకోడానికి వీలవుతుంది.

నాగార్జునసాగర్ ఎడమకాల్వ తమ్మిలేరు ప్రాజెక్టు కూడా మెరక ప్రాంతాలకు ఉపయోగపడేవి. తెలంగాణాలో తమ్మిలేరుమీద తుమ్మూరు ప్రాజెక్టు కట్టినారు. అక్కడనుంచి తెలంగాణాలో కాలవలున్నాయి. కుడివైపు తిరువూరు తాలూకా ఎడమవైపు చింతలపూడి తాలూకా, ఈ కాలవను అభివృద్ధి చేసినట్లయితే 5, 6 వేల ఎకరాలు సాగవ్వడానికి సిద్ధంగా ఉన్నది. మంత్రులు అదీ కూడా చూశారు. అభివృద్ధి చేస్తామని చెప్పారు. అట్లా చేస్తే తెలంగాణాలో చెరువుల యిబ్బందులు కూడా పోతాయని యింజనీరులు చెప్పారు. కాబట్టి ఈ మూడు నీటిపారుదల ప్రాజెక్టులను వెంటనే అమలు చేయవలసినదని కోరుతున్నాను. ఆవిధంగా చేస్తే వెనుకబడిన ప్రాంతాలు అభివృద్ధి చెందుతాయి.

ఒక సందర్భములో " ప్రజలకు తిండిలేక పోయినా కనీసం పశువులకైనా మేత కల్పించేందుకు రైతులను లంక భూములనుంచి తొలగించాము " ని శ్రీ కళా వెంకటరావుగారు చెప్పారు. కాని పశువుల తిండిమాట దేముడెరుగు కాని పశువులకు అనేక రకాల జబ్బులు వస్తున్నాయి. పశువైద్యశాఖ మాత్రం వాటికి మందులు ఇచ్చే స్థితిలో లేదు. తిరువూరు తాలూకాలోని పశువులకు గత రెండు సంవత్సరాల నుంచీ సర్రా అనే వ్యాధి వస్తున్నది. మెట్ట ప్రాంతాలలోని ఈ వ్యాధి ఎక్కువగావస్తున్నదని District Veterinary Officer గారు కూడా అంగీకరించారు. ప్రభుత్వంవారు మందు సప్లయి చేయడం లేదు.

రైతులు వెళ్ళి డాక్టరుకు తెలియజేస్తే వారు వస్తారు. ఈలోగా కొన్ని పశువులు చచ్చి పోతున్నాయి. వారు వచ్చి " నాదగ్గర మందు లేదు, మీరు ప్రయివేటు మార్కెటులో కొని తెచ్చుకోండి, నేను treat చేస్తాను" అని సమాధానం చెబుతారు. కాని ప్రభుత్వం దగ్గర మందు వున్నదో, లేదో, సప్లయి చేస్తుందో లేదో ఏ సంగతీ తెలియదు. ప్రభుత్వ విధానాలు ప్రతి విషయంలోనూ ఈ విధంగానే వుంటున్నవి.

ఉయ్యూరు షుగర్ ఫ్యాక్టరీకి 12 లక్షల రూపాయల విలువచేసే సరకును అక్కడి రైతుల యిచ్చారు. పంచదార మిల్లువారు ఆ 12 లక్షలు రూపాయలు రైతులకు ఇంతవరకూ యివ్వలేదు. ఈ విషయాన్ని గత నాలుగు నెలలనుంచి అనేక పర్యాయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చాము. ఈ విషయంలో చర్య తీసుకునేందుకు ప్రభుత్వానికి అధికారం లేదంటున్నారు. కొన్ని అధికారాలు తీసుకొంటున్నారు, కాని పంచదార మిల్లువారు రైతులకు యివ్వవలసిన 12 లక్షల రూపాయలు యివ్వాలంటే ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఆర్థిక శాఖ మంత్రిగారు వింటారేమో అనుకుంటే వారు వినడం లేదు. ఇదివరకు వారికి కొన్ని లక్షల రూపాయలు బోనస్ యివ్వవలసి వచ్చినప్పుడు కూడా నిరాకరించారు. ఈనాడుకూడా రైతులకు యివ్వవలసిన 12 లక్షల రూపాయలు యివ్వడానికి ప్రభుత్వం ఏమీ చర్య తీసుకోవడం లేదు. ఇట్లు చేయడం చాలా విచిత్రంగా వున్నది. ఇలాంటి పరిస్థితులలో రైతులను Small Savings Scheme లో పాల్గొనమంటే ఎట్లా సాధ్యం? ఎక్కడనుంచి తెస్తారు? వారు చాలా నిరుత్సాహ పడుతున్నారు. ఇవి సెప్టెంబరు, అక్టోబరు నెలలు, ఇప్పుడు ఎవరిదగ్గరా డబ్బు లేదు. ఇట్టి పరిస్థితులలో Small Savings Scheme అనేది నిర్బంధంగా అమలు చేస్తే అది సరైన పద్ధతి కాదు. ఈ పాలసీని ప్రచారానికి పెట్టిడబ్బున్నవారి దగ్గరనుంచి వసూలు చేయవలసినదని మనవిచేస్తున్నాను.

బెజవాడ, గుంటూరు మ్యునిసిపాలిటీలకు ఎన్నికలు జరుపుతున్నామన్నారు. గత 5, 6 రోజులుగా విజయవాడ మ్యునిసిపాలిటీలోని వార్డులను విభజించే విషయంలో ఏవో మార్పులు చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఎప్పుడో 5 మాసాల క్రితం బెజవాడ మ్యునిసిపాలిటీలో ఒక వ్యక్తి వార్డుల విభజన విషయంలో ఒక పిటీషను పెట్టుకున్నాడని ఇప్పుడు ఆ స్పెషలాఫీసరు గారిని ఇక్కడకు పిలిపించి ఇంకా నలుగురయిదుగురు ఉద్యోగులను కూడ తీసుకొచ్చి ఇక్కడే ఆఫీసుపెట్టి వార్డులను విభజనచేయించే కార్యకలాపములన్నీ ఇక్కడనే తయారు చేయించడం అవసరమేమి వచ్చింది? ఇది నిబంధనలకు వ్యతిరేకంకాదా? ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా

ఈ విధంగా చేయడం బాగుండలేదని సవినయంగా మనవి చేస్తున్నాను. కమీషనరు, ఆర్. డి. హెచ్ and I.L.B. ని ఇటువంటి విషయాలలో సంప్రదించి చేయవలసుంటుంది. ప్రజాభిప్రాయాన్ని మన్నించవలసుంటుంది. అంతేనేగాని స్పెషలాఫీసరు ఎవరో కొందరు వ్యక్తుల అభిప్రాయాలనుబట్టి ఈ విధంగా చేయరాదని మనవి చేస్తున్నాను. స్పెషలాఫీసరు ప్రభుత్వ ఉద్యోగిగా వ్యవహించవలెనేగాని ఎవరో ఒకరి ప్రోత్సాహంతో పనిచేయడం మంచిదికాదు. ఆయన ఆఫీసు బెజవాడలో ఉండగా ఈ కార్యకలాపమంతా అక్కడనే చేయకుండా, హైదరాబాదులో తాత్కాలికంగా ఆఫీసు పెట్టుకుని పనులు ఇక్కడనే చేయడం మంచిదికాదని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఈ ప్రభుత్వం దీనిని హర్షించకూడదని తెలియచేస్తున్నాను.

شریمتی معصومه بیگم [Smt. Masooma Begam (Pathergatti)] :- جناب اسپیکر صاحب - میں قلیل پس اندازی اسکیم کے سلسله میں دو شبدھ کہونگی - پس اندازی کی عادت عموماً ہمارے لوگوں میں بہت کم پائی جاتی ہے - ہمارا مقصد اس اسکیم سے لوگوں کو پس اندازی سکھانا ہی نہیں ہے بلکه ہمارے پنچ ورشی یوجنا کو ملک کے ہر گوشه میں پھیلانا مقصد ہے اور اوسکے ساتھ ساتھ لوگوں کو یه بھی محسوس کرانا ہے که ملک کی پنچ ورشی یوجنا کو کامیاب بنانے میں اون کا بھی حصه ہے - اس میں شک نہیں ہے که جو لوگ زیادہ رقم دے سکتے ہیں اون سے ہمیں آسانی سے رقم وصول ہوسکتی ہے - لیکن چھوٹی چھوٹی رقم وصول کرنا مشکل ہوتا ہے تاہم ہمیں لوگوں کو یه محسوس کرانا ہوگا که انکی اس بچت سے ملک کی ترقی میں اون کا بھی حصه رہے گا - لیکن اس چھوٹی چھوٹی رقم کی بچت کے سلسله میں لوگوں کو دو تین چیزوں کی دقت پیش آرہی ہے - پہلے تو یه که جو کارڈس دئے جاتے ہیں اون کو اسٹامپ لگانا پڑتا ہے - دوسرے یه که غریب طبقه چھوٹے چھوٹے گھروں میں رہتا ہے بارش میں اون کے گھر بھیگ جاتے ہیں اور اسکی وجه سے اون کے کارڈس اور اسٹامپ وغیرہ خراب ہو جاتے ہیں اور دو دو چار چار آنے جو وہ لوگ جمع کرتے ہیں وہ بیکار ہو جاتے ہیں - اس لئے الیمونیم یا ٹین کے کارڈس اگر اجرا کئے جائیں تو ٹھیک ہوگا تاکه وہ بارش یا آگ سے ضائع نه ہونے پائیں اور محفوظ رہ سکیں - تیسری چیز یه ہے که اس رقم کو واپس حاصل کرنے کے لئے ۱۲ سال کی مدت رکھی گئی ہے جو کافی بڑی مدت معلوم ہوتی ہے - جب لوگوں سے یه کہا جاتا ہے که ۱۲ برس تک آپ کے پیسے رکھے جائینگے تو وہ لوگ گھبرا جاتے ہیں - اس لئے اس مدت کو کم کرنا بہتر ہوگا - لوگ بڑے شوق سے پیسه جمع کرواسکینگے - ہمارے ملک میں (۸۰) فیصد لوگ ایسے ہیں جنہیں ایک وقت کا کھانا میسر نہیں ہوتا - ہمیں اون سے دو چار آنے مانگتے ہوئے بھی شرم آتی ہے - لیکن جیسا که میں نے کہا ہے ہمارا مقصد اون کو یه محسوس کروانا ہے که وہ دو چار آنے جمع کرکے اپنی ملک کی مدد کررہے ہیں اور ملک کی ترقی میں اون کا بھی حصه ہے - اگر یه احساس اون میں پیدا ہو جائے تو اوسکی خوشی ہی اور ہوگی - اس لئے میرا کہنا ہے که ان دو تین چیزوں کا انتظام کیا جائے - ایک تو مدت کم کی جائے اور دوسرے ایسا انتظام

کیا جائے کہ اون کے کارڈس ضائع نہ ہونے پائیں - اگر ایسا ہوتو میں سمجھتی ہوں
کہ اچھا ہوگا -

డా. బి. గోపాలరెడ్డి :—అధ్యక్షా, స్మాల్ సేవింగ్సు విషయంలో లక్ష రూపాయలివ్వడం గురించి ఎవరూ ఆక్షేపణ చెప్పలేదు. బోర్డు ఆఫ్ రెవిన్యూలోనూ, కలక్టరాఫీసులోనూ ప్రత్యేకంగా ఏదో కొంతపని ఉంటుంది కనుక సూపరింటెండెంటును, ఎల్. డి. క్లార్కును, యు. డి. క్లార్కును నియమించడానికి లక్ష రూపాయలు ఇస్తారని ఎవరూ చెప్పరు. కాబట్టి ఆ విషయంలో ఎక్కువ పెడుతున్నామనిగాని, ఇంకేదో విలం ఇస్తున్నామనిగాని ఎవరూ ఆక్షేపణచేయ నక్కరలేదు. అయితే ఈ వసూళ్ల విషయంలో కొంత నిర్బంధంచేస్తున్నారని అన్నారు. అంతేకాక ఈ చేస్తున్నటువంటి వసూళ్లకు తోడనే రసీదులుగాని, సర్టిఫికేట్లుగాని ఇవ్వడంలేదని అన్నారు. ద్రవ్యం వృధా అవుతున్నదని కూడ ఒక మాటవచ్చింది. మరొక సభ్యులు మ్యునిసిపల్ ఎన్నికలు విషయము చెప్పారు. ఇంకొకరు ఎడమకాలవ గురించి చెప్పారు. మొత్తంమీద ప్లానింగుకు సంబంధించిన విషయాలు కనుక ఇవన్నిచెప్పినారేమోనని నేననుకుంటున్నాను. స్మాల్ సేవింగ్సు వసూళ్ళ విషయంలో నిర్బంధంచేయమని మేము కలక్టర్లనుగాని, తహసీల్దార్లనుగాని అడగలేదు. ఐచ్ఛికంగా ఇచ్చినవారి దగ్గరనుంచే వసూలు చేయవలెనని మా ఉద్దేశం. కేవలం నిర్బంధంగా ఏదో లెవీ మాదిరిగా చేయవలెననే అభిప్రాయం మాకులేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—కేవలం నిర్బంధంచేయడం లేదన్నారు. అంటే కొంత వరకు ఇచ్ఛికంగాను, కొంతవరకు నిర్బంధంగానూ వసూలు చేస్తున్నారా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—ఎక్కడఐచ్ఛికం ఎక్కడ మోరల్ పర్సుయేషను ? ఈ రెంటికి ఎక్కడ డీమార్కేటింగు లైను అనేది చెప్పడం కష్టమవుతుంది. ప్రజలకు పదేపదే నచ్చచెప్పి వాళ్లదగ్గర నుంచి ఐచ్ఛికంగా, డబ్బు వసూలు చేసుకోవడమే మాఉద్దేశం. ఆ మాదిరిగానే మా కలక్టర్లు, తహసీల్దారులు చేస్తున్నారు. వోట్లు అడిగే విషయంలో కూడా పదేపదే మనం ప్రజలను అడుగుతాము. ఒక్కొక్కసారి మనమీద కూడ వోటర్లు ఆగ్రహించుకోవచ్చు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—పదేపదే అంటే పర్సుయేషను అవుతుందా............

మిస్టర్ స్పీకర్ :—ఆ విధంగా interrupt చేయవద్దు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—కలక్టర్లుగాని, తహసీల్దార్లుగాని నిర్బంధంగా వసూలుచేయరు. అప్పుఇస్తేనేగాని వూరుకోమని అనరు. అప్పు ఇవ్వలేదు కాబట్టి జప్తుచేస్తామని అనరు. ఆయా గ్రామాలలోని పంచాయితీ బోర్డు ప్రసిడెంట్లనుగాని, మునసబులనుగాని, కరణాలనుగాని ప్రోత్స హించి ప్రభుత్వానికి ఐచ్ఛికంగా అప్పులు ఇచ్చే ఉత్సాహం కలుగజేయడానికి ప్రయత్నం చేస్తారు. అంతేగాని నిర్బంధమనేదిలేదు.

ఎవరైనా షాహుకారును నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్సు కొనలేదని నిర్బంధంగా Lock-up లో పెట్టుతున్నారనేటట్లయితే, అటువంటివి తప్పకుండా మేము విచారించడానికి ఆక్షేపణ లేదు. కాని తహశిల్దార్లు అడగటంగాని, కలెక్టర్సు నలుగురిని పిలిచి చెప్పటంగాని, నిర్బంధం

క్రిందకు రాదు. ఇది ప్లానుకోసం కావలసిన ద్రవ్యంకాబట్టి, ఉత్సాహంతో ముందుకువచ్చి "మేము వసూలు చేస్తాము, సహాయం చేస్తాము" అని చెప్పడంలో అన్యాయం లేదు. వారి వారి శక్తికొలది త్యాగం చేస్తాము అని అనవచ్చు. ఇది పన్నుకాదు. పన్ను అయితే తిరిగిరాదు. ఇది వడ్డీతో సహా అసలు ఫాయిదాలు యివ్వబడే మొత్తం. "మీ ఖర్చులు తగ్గించుకొని మా National Savings Certificates లో invest చేయండి. మీ అబ్బాయి చదువుకో, అమ్మాయి వివాహానికో పనికివస్తుంది, పది ఏళ్లయిన తరువాత వడ్డీతో సహా వస్తుంది, 10 రూపాయలు యిస్తే రు. 15, రు. 16, అవుతుంది," అని చెప్పటం నిర్బంధం కాదనుకుంటాను. ఖర్చులు తగ్గించుకోమని చెప్పటం మంచిదే ననుకుంటాను. ఆ రీతిగా చెప్పాలని మా తహశీల్దారును ప్రచారకులను తయారు చేస్తున్నాం. ఇంతమందీ ఉద్యోగస్థులు ప్రచారం చేస్తుంటే, ఎవరైనా ఒక గిర్దావరుగాని తహసిల్దారుగాని ఏదైనా చేస్తే చేయవచ్చును. కాని మా ఉద్దేశం అదికాదు. ఇది పొదుపు ఉద్యమం. ఇందులో పోయేదీ ఏమీలేదు. ఈ స్మాల్ సేవింగ్సు ఒక సంవత్సరంతో పోతుందని, 1957–58 తో అయిపోతుంది—అనే మాటకాదు. ఇది క్రమేణ ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికలలో ఉండేది కాబట్టి, ఖర్చులు తగ్గించుకొని పొదుపు చేసుకొనటం ప్రజలకందరికీ ఆ సైకాలజీ రావడం మంచిది. పొదుపుచేసి అది ప్లానుకోసం ఉపయోగపడుతుందని సహాయం చేయుటం, అది దేశానికి క్షేమంగా ఉంటుందనే భావం పరివ్యాప్తంకావటం యిప్పుడు జరగవలసి యున్నది. ఇప్పుడు కష్టంగా ఉన్నా, దీర్ఘకాలంగా చూస్తే, యిది మన దేశానికి, ప్రజలకు క్షేమంగా ఉంటుంది అనే భావం యింకా మెదడులోకి జొరబడటం లేదు. దానికి ప్రచారం చేయాలని, ప్రోత్సహించాలని మా ఉద్దేశం. ఎక్కడైనా నిర్బంధం చేసి, దబాయించి, యివ్వకపోతే ప్రాసిక్యూట్ చేస్తాం, అని చెప్పటం న్యాయంకాదు. ఎక్కడైనా అటువంటి నిర్బంధం జరిగితే కలెక్టరుకుగాని, మాకుగాని తెలిపితే తగిన చర్య తీసుకొనబడుతుంది.

హుజూర్‌నగర్ M.L.A., గారు, వారితో తాసిల్దారు మాట్లాడారని, వారు కూడ చాల suggestions చేశారని, వారి సంప్రదింపులతో initial కార్యక్రమం జరిగిందని చెప్పారు. అట్లానే అక్కడ స్థానిక ప్రముఖుల సహాయం తీసుకొని ఈ ఉద్యమం పరివ్యాప్తం కావటానికి తోడ్పడతారని ఆశిస్తున్నాం. ఎక్కడైనా వసూలు చేసిన మొత్తములకు రశీదులుగాని, సర్టిఫికెట్సుగాని యివ్వకుండా కాలయాపన చేసి misappropriate చేసి ఉంటే అది చాలా serious offence. ఆ విధంగా ఏ non-official గాని, official గాని, తాసిల్దారుగాని, ఎవరూ చేయడానికి వీలు లేదు. చిన్నచిన్నవారి ద్రవ్యమును ఒక పవిత్ర కార్యమునకు వసూలు చేస్తున్నపుడు దానిని misappropriate చేస్తే చాలా severe action తీసుకోవలసి వస్తుంది. ప్రభుత్వంవారు తప్పక చర్య తీసుకొంటారు. ఇరవై వేలు వసూలుచేసి, పదివేలు జమకట్టారు, పదివేలు గల్లంతు అయినది—అనేమాట ఉంటే మాకు తప్పక తెలిపితే చర్య తీసుకొంటాము.

శ్రీమతి మాసుమా బేగమ్‌గారు ఒక విషయం చెప్పారు. కార్మికులకోసం ఒక పద్ధతి ఉన్నది. ఆ మొత్తం అయిదు రూపాయలలోపు అయితే దానికి బిళ్ళలు యిస్తారు. ఆ బిళ్లలు—అయిదు రూపాయలవి అవగానే సర్టిఫికేటు తీసుకొనవచ్చును. ఆ బిళ్లలు అగ్నికి, వర్షానికి చెడిపోకుండా ఉండేందుకు తగరం బిళ్ళలు యివ్వమంటే కుదరదు. అది అవసరం లేదు.

ఈ సర్టిఫికేట్సు కాలపరిమితి తగ్గించే విధంగానూ, యింకా అనేక సౌకర్యాలు కలుగజేయవలెనని చెప్పారు. ఇది, అక్కడ కేంద్ర ప్రభుత్వంవారు, నేషనల్ సేవింగ్సు కమిషనర్—ఆలోచించవలసిన విషయం.

ఈ సర్టిఫికేట్సులో మూడు రకములున్నవి, ట్రెజరీ సర్టిఫికేట్సు పది ఏండ్లది; నేషనల్ ప్లాను సర్వీసుసర్టిఫికేట్లు 12 ఏండ్లవి, Annuity Certificates 15 ఏండ్లవి, ఈ మాదిరిగా 10 ఏండ్లవి, 12 ఏండ్లవి, 15 ఏండ్లవి, మూడు రకాలవి ఉన్నవి. ఈ కాలం యింకా తగ్గించడానికి గాని, యింకా ఏవైనా సౌకర్యాలకుగాని గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారి అనుభవం చూచుకొని ఏవైనా సిఫారసులు చేయడానికి వీలౌతుందేమో చూస్తాము.

మా ఉద్దేశం స్పష్టంగా చెబుతున్నాము. ఈ ఉద్యమం నిర్బంధంగా సాగించాలని కాదు. చిన్నవాళ్ళు మొదలుకొని పెద్దవాళ్లవరకు యిది పరివ్యాప్తం కావాలని మా ఉద్దేశం. ఇంతవరకు 80 లక్షలు వచ్చింది. ఇంకా రావలసినది ఎంతో ఉన్నది. పదవవంతు కూడా రాలేదు. ఈ లోపున గందరగోళపడి, పనిచేసేవారికి నిరుత్సాహం కలిగిస్తే వారు పనిచేయలేరు. వాళ్లందరికీ తోడ్పడి ఈ ఉద్యమాన్ని జయప్రదం చేయాలి. హుజూర్‌నగర్ M. L. A., తహశీల్దారుతో సహకరించి నిర్బంధం లేకుండా వారి తాలూకాలో ఒక లక్ష ఇరవై వేలు సంపాదించడానికి ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. వారేకాదు. అన్ని పార్టీలవారు సహకరిస్తేగాని ఈ ప్లాను జయప్రదంకాదు. మంత్రులు కూడ జిల్లాలకు గ్రామాలకు, పోతున్నారు అంటే యిది చిక్కు అయిన విషయం. చిన్న కార్యక్రమాలకు పోతున్నామేమో అనిపిస్తుంది. కాని ఏదో ఒక మిష పెట్టుకొని జిల్లాకో తాలూకాకో పోయి ప్రజలను కలుసుకుంటూ ఉండటం అవసరం అనుకుంటాను. నిన్న నల్లగొండనుంచి కొందరు వచ్చి 'మీలాదినబి' చేస్తున్నాం, రమ్మనమని పిలిచారు. అక్కడున్నటువంటి మహమ్మదీయ సోదరులు హిందువులు కూడ, "మిలాదీనబి" చేస్తున్నారు. మిలాదినబీకి గోపాలరెడ్డిగారికి ఏమిటి సంబంధమని సభ్యులు ఆక్షేపణ చేయవచ్చు. గోపాలరెడ్డిగారు నల్లగొండ ఎందుకుపోవాలి, అని సభ్యులు అనవచ్చు. మేము ఒక్క ఫంక్షన్ కోసమే అక్కడకు పోము. అక్కడ కలెక్టర్స్ ఉంటారు. కొంతమంది నాన్ అఫీషియల్స్ ఉంటారు. అక్కడకుపోయినపుడు అక్కడున్న పదిమందితోను మాట్లాడటము, వారితో సంప్రదించటము, వారు చెప్పింది వినటము జరుగుతుంది. కాబట్టి ఆ విషయాలు గురించి ఆక్షేపణ చేస్తే కష్టం అవుతుంది. అయితే సినిమాల విషయంలో శతదినోత్సవాలలో మంత్రులు పాల్గొంటున్నారని కొందరు విమర్శిస్తున్నారు. కళలను అభివృద్ధిచేయాలని మనం ఒకవైపున అంటున్నాము. అంటునప్పుడు "ఏదో తుచ్ఛమైన క్రీడ ఇది; మీరంతా సినిమా తారలు; కాబట్టి మీ యొక్క ఫంక్షన్లకు మేము రాము" అని చెప్పి వాళ్లకు దూరంగా ఉండటం కూడా మంచిది కాదేమో నని అనుకొంటున్నాను. వారు ఏదో మంచిపని చేస్తున్నారు. దేశంలోని నలుగురికీ ఆనందాన్ని కలుగ జేస్తున్నారు. వారిలో తప్పులు ఉంటే చెప్పవచ్చును. వారి విషయాలు తెలుసుకొని, వారికి సలహాలు చెబితే మంచిదిగాని "మేము మహామంత్రులము; మేము రాము, మీకు కావలనసిటువంటి వారిచేత ఉత్సవాలు చేయించుకోండి" అని అంటే అది న్యాయంగా ఉండదు. ఇటువంటి క్లిష్టమైన విషయాలలో యీ డిస్‌క్రిషన్ ఆయా వ్యక్తులకే ఇస్తే మంచిదికాని, "దీనికి పోవచ్చు; దీనికి పోవద్దు" అని చెప్పటము కొంచెము కష్టముగా ఉంటుంది.

అయితే ఇప్పుడు సభ్యులు చాలామంది తమ అభిప్రాయాలు తెలిపినారు. మనము నిర్ణయించుకొన్న యీ తొమ్మిదికోట్లు వసూలు చేసినాము అన్న విషయాన్ని చెప్పుకోటానికి మనం ప్రయత్నం చేయాలి. అందుకు అందరి సహాయము కావాలి. అసలు విషయానికి ఎవరికీ ఎలాంటి ఆక్షేపణ లేదు. కాబట్టి యీ డిమాండ్‌ను ఆమోదించవలసిందిగా కోరుతున్నాను.

*Mr. Speaker* : I shall now put the cut motions to Demand No. IX to vote.

The question is :

"To reduce the allotment of Rs. 1,00,000 for Heads of State, Ministers and Headquarters Staff by Rs. 100."

(To criticise the compulsory collection of small savings especially from small income persons).

The motion was negatived

*Sri P. Sundarayya :* I demand a division, Sir.

The House then divided.

Ayes.....33

1. Sri P. Narasinga Rao.
2. Sri G. Ganga Reddy.
3. Sri A. Yeruku Naidu.
4. Sri K. Rajmallu.
5. Sri P. Sundarayya.
6. Sri P. Venkateswarlu.
7. Sri Ch. Rajeswar Rao.
8. Sri K. L. Narasimha Rao.
9. Sri S. Vemayya.
10. Sri G. Yellamanda Reddy.
11. Sri B. Sankaraiah.
12. Sri S. Kasi Reddy.
13. Sri M. Nagi Reddy.
14. Sri D. Narasayya.
15. Sri K. Ramachandra Reddy.
16. Sri B. Dharma Bhiksham.
17. Sri L. Venkata Reddy.
18. Sri N. Peddanna.
19. Sri Anantha Reddy.
20. Sri Polasani Chokka Rao.
21. Sri A. Venkata Rama Raju.
22. Sri G. Nageswara Rao.
23. Sri Md. Tahseel.
24. Sri P. Satyanarayana.
25. Sri B. Audinarayana.

26. Sri G. Suryanarayana.
27. Sri Vavilala Gopala Krishnaiah.
28. Sri Anthiah.
29. Sri Muthiam Reddy.
30. Sri C. V. Somayajulu.
31. Sri Bannappa.
32. Sri Kistamachary.
33. Sri Srinivasa Rao.

Noes ... ... ... 85

1. Sri N. Sanjiva Reddy, Chief Minister.
2. Sri K. Vijayabhaskara Reddy.
3. Sri P. Ranga Reddy (Government Whip.).
4. Sri Achuta Reddy.
5. Sri T. Anjaiah.
6. Sri Beesetti Appa Rao.
7. Sri Raja M. R. Appa Rao Bahadur.
8. Sri G. Bapaiah.
9. Sri Peta Bapaiah.
10. Sri A. Bapineedu.
11. Sri E. Basappa
12. Sri A. Bhagavantha Rao.
13. Sri P. Biappa Reddy.
14. Sri Seerla Brahmayya.
15. Sri N. Chenchurama Naidu.
16. Sri N. P. Chengalraya Naidu.
17. Sri Dawar Hussain.
18. Sri V. Gopala Krishna.
19. Sri P. Gopalakrishna Reddy.
20. Sri T. Gopala Krishniah Gupta.
21. Sri P. Gopalu Reddy.
22. Sri M. Harischandra Prasad.
23. Sri T. Hygrivachari.
24. Sri K. Janardhan Reddy.
25. Sri S. K. V. Krishnavatharam.
26. Sri V. Kodanda Rami Reddy.
27. Sri J. Kondal Rao.

Noes............85—(*Contd.*)

28. Sri T. Lakshmi Narayana Reddy.
29. Dr. B. Gopala Reddy, Minister for Finance.
30. Sri D. Sanjeevayya. Minister for Labour & Social Welfare.
31. Sri A. B. Nageswara Rao.
32. Sri Arige Ramaswamy.
33. Sri Sheik Md. Rahamathullah.
34. Sri Manda Sailu.
35. Dr. Naganna.
36. Sri Padmanaba Reddy.
37. Sri G. V. Pithambara Rao.
38. Sri M. Potha Raju.
39. Sri K. Punnayya.
40. Sri B. Rajayya.
41. Sri P. V. Rajeswara Rao.
42. Sri P. Ramachander Rao.
43. Sri T. Ramachandra Reddy.
44. Sri P. Ramacharlu.
45. Sri N. Ramachandra Reddy.
46. Sri V. Rama Rao.
47. Sri G. Ramaswamy Reddy.
48. Sri P. Ramaswamy Naidu.
49. Smt. Masuma Begum.
50. Smt. C. Ammanna Raja.
51. Smt. K. Kanuka Ratnamma.
52. Smt. T. Lakshmikanthamma.
53. Smt. Shantha Bai.
54. Sri U. Ranga Babu.
55. Sri Ranga Reddy.
56. Sri A. Ratnam.
57. Srimati Sumitra Devi.
58. Srimati Y. Sita Kumari.
59. Sri K. Santhappa.
60. Sri Ch. Satyanarayana.
61. Sri B. Satyanarayana Rao.

Noes...........85—(*Contd.*)

62. Sri N. C. Seshadri.
63. Sri Shahabuddin Ahmed Khan.
64. Sri Sheik Moula Saheb.
65. Sri P. Sree Ramulu.
66. Sri Mir Ahmed Ali Khan.
67. Sri Konda Lakshman Bapuji, Dy. Speaker.
68. Sri B. Subba Rao.
69. Sri S. Ranganatha Mudaliar.
70. Sri R. Tirupathi Rao.
71. Sri Vasudev Krishnaji Naik.
72. Sri G. Veerayya.
73. Sri N. Venkiah.
74. Sri C. P. Thimma Reddy.
75. Sri Reddi Jagannadham.
76. Sri D. V. Ramana Reddy.
77. Sri A. Lakshmu Naidu.
78. Sri R. Latchapatrudu.
79. Sri M. Matcharaju.
80. Sri T. N. Venkata Subba Reddy.
81. Sri P. Venkataswami Reddy.
82. Sri Venkateshwara Rao.
83. Sri E. Venkatrama Narasayya.
84. Sri Venkatarama Reddy.
85. Sri Kasim Venkata Reddy.

The motion was negatived.

మిస్టర్ స్పీకర్ : తరువాత 8వ నెంబరుది, గోపిడిగంగారెడ్డిగారి కోత తీర్మానము ఉన్నది. కాని దానికి దీనికి భేదము ఉన్నట్లు కన్పించదు. అందులో "కరువు రోజులలో ప్రజలు యిబ్బంది పడకుండ" అనిచేర్చారు. దీనికి కారణము ఒకటి చూపించారు. స్వల్ప మొత్తములకు పొదుపు ఉద్యమము సాగించి బలవంతముగా డబ్బువసూలు చేస్తున్నందుకు అనికారణము చూపించారు. కాని ఇదిప్రత్యేకముగా ఓటుకు పెట్టనక్కరలేదని నిర్ణయించాను. తరువాత 2, 3, 4, 5, 6, 7, 9, 10, 11, 12, నెంబర్లుగల కోత తీర్మానములు **move** చేయడంలేదు. కనుక వీటిని ఓటుకు పెట్టనవసరములేదు.

The Question is :

"That Government be granted a further sum not exceeding Rs. 1,00,000 under Demand No. IX - Heads of State, Ministers and Headquarters Staff."

The motion was adopted.

Demands No. XXVII, XXXVII, XLI and XLIII.

*Sri P. Sundarayya.*—Mr Speaker, Sir, I would now suggest that we may take up the Demands for Irrigation, Multi-purpose Projects and Electricity.

*Mr. Speaker.*—Yes, we shall take up these Demands. The hon. Minister for Finance may move Demands Nos. 27, 37 41, and 43.

*Dr. B. Gopala Reddy.*—On the recommendation of the Governor, I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 200 under Demand No. XXVII—Electricity."

*Mr. Speaker.*—Motion moved.

*Dr. B. Gopala Reddy.*—On the recommendation of the Governor, I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand No. XXXVII—Capital Outlay on Irrigation."

*Mr. Speaker.*—Motion moved.

*Dr. B. Gopala Reddy.*—On the recommendation of the Governor, I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 9,79,800 under Demand No. XLI—Capital Outlay on Multi-purpose River Schemes."

*Mr. Speaker.*—Motion moved.

*Sri P. Narasinga Rao.*—I beg to move:

"To reduce the allotment of Rs. 200 for Electricity by Rs. 100."

(To disapprove the suspension of the interim relief of Rs. 6 per month to the Hyderabad City Electricity Department Workers and the anti-labour policy of the Government in encouraging rival I. N. T. U. C. Union in the Electricity Department).

*Mr. Speaker.*—Motion moved.

*Sri P. Sundarayya.*—I beg to move:

"To reduce the allotment of Rs. 300 for Capital Outlay on Irrigation by Rs. 100."

(To criticise the policy of the Government in trying to finance the new schemes from the allotments made for the existing schemes and also the failure to allot sufficient funds to provide the channels to facilitate full utilisation of the waters of Krishna barrage.)

*Mr. Speaker.*—Motion moved.

*Sri P. Narasinga Rao.*—I beg to move:

"To reduce the allotment of Rs. 9,79,800 for Capital Outlay on Multi-Purpose River Schemes by Re. 1."

(To discuss the delay in the execution of the Godavary Valley Power Development Scheme)

*Mr. Speaker.*—Motion moved.

*Sri M. Nagi Reddy.*—I beg to move:

"To reduce the allotment of Rs. 9,79,800 for Capital Outlay on Multi-Purpose River Schemes by Rs. 100."

(To criticise the failure of the Government to provide to the staff and labourers working at Nagajunasagar, fair price shops to supply food grains cheaply, and their action in denying housing facilities on the pretext of its being contract labour, and additional dearness allowance of Rs. 6 on the plea of 'work charged' establishments and also their failure to fix the minimum wages.)

*Mr. Speaker.*—Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya.*—I beg to move:

"To reduce the allotment of Rs. 300 for Capital Outlay on Electricity Schemes by Rs. 100."

(To criticise the policy of the Government and to demand the reinstatement of the workers and the staff sent out forcibly from Machkund and Jalaput.)

*Mr. Speaker.*—Motion moved.

శ్రీ కె. కృష్ణమాచారి (సంగారెడ్డి—జనరల్) :—అధ్యక్షా, ఈ సప్లిమెంటరీ డిమాండులపై చర్చల సందర్భంలో ఇర్రిగేషను గురించి నేను కేవలం ఒకే సమస్యను మీ ద్వారా ప్రభుత్వం ముందు తేదలచుకున్నాను. ఎన్నో దినాలనుండి మెదక్ జిల్లాలో నిర్మాణము కానున్న దేవనూరు ప్రాజెక్టు కార్యరూపంలోనికి రాబోతున్నదని విన్నాము. చాలా సంతోషించాము. ప్రజానీకం చాలా దినాలనుండి మెదక్ జిల్లాలో కూడా ఒక ప్రాజెక్టు నిర్మాణం కాబోతున్నదని దీనినుండి రైతాంగానికి వ్యవసాయానికి ఏదో మేలు కలుగబోతున్నదీ అన్న సంతోషంలో ఉత్సాహవంతంగా వుండేది. కాని నాకు తెలిసినంతమట్టుకు ఈ దేవనూరు ప్రాజెక్టు గురించి కొన్ని విషయాలు అవగాహన చేసుకున్నప్పుడు ప్రజానీకం అంత సంతోషించ లేకుండా వున్నారు. దానికి కారణం దేవనూరు ప్రాజెక్టు, దేవనూరు ప్రాంతంలో అనగా మెదక్ జిల్లాలో కట్టబడినప్పటికి దానిని హైదరాబాదుకొరకు సికిందరాబాదుకొరకు, కేవలం **water works** కొరకు మాత్రమే తెచ్చేటందుకు ప్రయత్నం చేస్తున్నారన్న విషయం విశదమవు తున్నది. అయితే హైదరాబాదు, సికిందరాబాదు నుండి కనీసం 80, 90 మైళ్లదూరంలో వున్న దేవనూరు ప్రాజెక్టునుండి 60, 70 గ్రామాలను నాశనంచేసి, 40, 50 వేల ఎకరాల భూమిని ముంచివేసిన పిదప ఆ నీళ్లను భగీరథ ప్రయత్నం చేసుకుంటూ తేవడం ఎందుకో కొద్దిగా ఆలోచించవలసి వున్నది. కనుక ఆ దేవనూరు ప్రాజెక్టు నిర్మించబడ్డా దానివలన అక్కడి రైతాంగానికిగాని, జిల్లా వాసులకుగాని ఏ విధమైన లాభమూ లేదని మాత్రం నేను మీముందు విస్పష్టంగా చెప్పదలచుకున్నాను. అంతే కాకుండా దేవనూరు ప్రాంతంలో తటాకాలుగాని చిన్నచిన్న చెరువులుగాని చాలా తక్కువగా వున్నాయి. అక్కడి భూమి సారవంతమైనది, సేద్యానికి చాలా అనుకూలంగా వుంది. కాని నీళ్లు లేక రైతులు చాలా బాధ పడుతున్నారు. దేశంలో ఆహార సమస్య క్లిష్టంగా వున్నప్పుడు అధికాహారోత్పత్తి అత్యవసరమని భావిస్తున్న తరుణంలో కేవలం హైదరాబాదు, సికిందరాబాదు కొరకు 90 మైళ్ల దూరంనుండి నీరు తెచ్చి అక్కడి రైతాంగానికి నష్టం చేయడం ప్రభుత్వం ఏ దృష్టితో చేసినదో నాకు అర్థం కావడం లేదు. అంతే కాకుండా బహుశః వేసవికాలంలో **Hydro Electricity** కి గాను నీళ్ళు నిజాంసాగర్‌లో నీళ్ళు తక్కువవుతాయన్న అభిప్రాయంతో దేవనూరు నీళ్లను యీ నిజాంసాగర్‌లో నింపి అక్కడనుంచి వేరే ప్రాంతాలకు నీళ్లు యివ్వబడుతున్నాయని కూడా సూచనగా వుంది. అయితే **Hydro Electric Project** కాకూడదని కాని నిజాం సాగర్‌లో నీళ్లుండకూడదని కాని దేవనూరు ప్రాజెక్టు మెదక్ జిల్లాలో కడితే కేవలం మెదక్

జిల్లావారికి ఆ అధికారం వుంది; వేరే జిల్లా వారు దీనినుండి లాభంపొంద కూడదనే సంకుచిత భావంతోగాని నేను చెప్పడం లేదు. అయితే ఒకవిషయం మాత్రం నేను అధ్యక్షులవారి ద్వారా ప్రభుత్వ దృష్టికి తేదలచుకున్నాను. నేను చూచినంతవరకు నిజాంసాగర్ క్రింద దోఫసలా భూములున్నప్పటికీ రైతాంగం తమకు నష్టం వస్తుందేమోనన్న భయంతోటి, నీళ్లున్నా ఒకే పంటకు నీరు తీసుకుంటున్నారు. ఇది అందరికీ తెలిసిన విషయం. అందువల్ల మెదక్ జిల్లా వాసులకు నీరు లేకుండా హైదరాబాదు, సికిందరాబాదుల కొఱకు కిలోమీటర్లను అభివృద్ధి చేయుడానికి మాత్రమే ఆ నీటిని నిజాంసాగర్‌లోకి పంపితే అది వృధా అవుతుందని నేను ఘంటా పథంగా చెప్పదలచుకున్నాను. నిజాంసాగర్ కొరకు అక్కడ ప్రజలకు అవసరం లేకున్నా నదిలోపల నీళ్లు కలిసిపోనీ అన్న దృక్పధంతో మనం చూసినట్లయితే మెదక్ జిల్లా వాసులకు అన్యాయం చేసిన వారమవుతామని సవినయంగా మనవిచేస్తున్నాను. మెదక్ జిల్లాలో మెదక్ తాలూకాలో తప్ప మిగతా ఏ తాలూకాలో కూడా నీటి పారుదల సౌకర్యాలు లేవు. అటువం టప్పుడు దేవనూరు ప్రాజెక్టును రైతాంగం irrigation purposes కు వాడుకున్నట్లయితే ఎంతో మేలయేదని నేను సవినయంగా మనవి చేస్తున్నాను. హైదరాబాదు సికిందరాబాదులకు నిజముగా నీళ్లు తక్కువయినట్లయితే అందుకు వేరే స్కీములున్నాయి. ఇప్పుడు దీనికి సంబంధం లేకున్నా నేను ఒక విషయం చెప్పదలచుకున్నాను. నాకు తెలిసిన లెక్కలు సరైనవైతే హైదరాబాదులో పదివేలో, పదహారువేలో, పైపులు మీటరు లేకుండా నడుస్తున్నాయి. ప్రభుత్వం ఆలోచించడం లేదో, మీటర్లు పెట్టడం లేదో ఏవో కారణాలవల్ల వాటికి మీటర్లు మాత్రము లేవు. వారంతా నీళ్లను అనవసరంగా ఖర్చు చేస్తారు. మళ్లా నీళ్లు తక్కువవుతున్నా యంటే సమంజసమైన విషయం కాదు. ఇంకొక స్కీమున్నది. మన ముఖ్య పట్టణమైన హైదరా బాదు జన సంఖ్య ప్రతి దినం పెరిగి పోతూవుండవచ్చు; పెరగాలనే మనం భావిస్తున్నాం. ఇక్కడ ఎన్నో కర్మాగారాలున్నాయి. ఈ జంట నగరాలు యింకా అభివృద్ధి కావాలని ప్రతివారు కోరేవారే, నేనుకూడా కోరుతున్నాను. వాటికి నీటి సరఫరా అభివృద్ధికి వేరే స్కీము ఒకటి వుందని సవినయంగా మనవి చేస్తున్నాను. ఇక్కడ నుండి సుమారు 40 మైళ్ల దూరంలో సంగా రెడ్డికి మూడు నాలుగుమైళ్ళ దూరంలోపల మంజీరా నక్కవాగు వున్నది. దానికి ఆనకట్ట కట్టి ఆ ఆనకట్ట ద్వారాచెరువువరకూ నీళ్లు తీసుకుని వచ్చి దానికి రెండు శాఖలుగా కాలువలు తీసి అక్కడనుంచి హైదరాబాదుకు నీటి సరఫరా చేయాలన్న స్కీము ప్రభుత్వ దృష్టిలో వుంది. ఆ స్కీము పరిశీలన కూడా బహుశః జరిగివుండవచ్చునని నేను భావిస్తున్నాను. ఎప్పుడయితే హైదరాబాదు సిటీ సప్లయికి సులభంగా 30 మైళ్ల దూరాన గల మంజీరా నది నుండి నీరు తీసుకునే అవకాశంవుందో, అటువంటి సమయంలో ఒక జిల్లాలోని కొన్నివేల కుటుంబా లను తరలించి, దేవనూరు ప్రాజెక్టు బ్రహ్మాండంగా తయారవుతుందని పేచి వున్నదానిని విడనాడి ఎక్కడనో hydro electric power పెంచడానికి ఆ నీటిని వాడి, జిల్లాలోవున్న వారిని కేవలం నీళ్లను చూసుకుని సంతోషపడడాని కొరకే వుంచినట్లయితే అది మాత్రం జిల్లావారి దౌర్భాగ్యం అని మీ ద్వారా ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను. కాబట్టి దేవనూరు ప్రాజెక్టును irrigation purposes కు వాడుకుని నేను యింతకు ముందు చెప్పిన స్కీము ప్రకారంగా City లో water supply కి సంగారెడ్డి నుండి నీరు తేవడానికి ప్రభుత్వంవారు ఆలోచించి దానిని పూర్తిచేసి యీ దేవనూరుప్రాజెక్టు కేవలం irrigation కొరకే యివ్వాలని నేను కోరుతున్నాను.

ఈ సమయంలో మళ్ళీ ఆ విషయం గురించి మరియొక విషయం చెప్పదలచుకొన్నాను. దేవనూరు ప్రాజెక్టు గురించి జిల్లా ప్రతినిధులు, ఆ జిల్లాలోని అందరు శాసన సభ్యులు, పార్టీ విచక్షణలేక, భేదాభిప్రాయములేక అన్ని పార్టీలు ఏకగ్రీవముగా ఒక మెమొరాండమును ప్రభుత్వానికి సమర్పించారు. దానిని శ్రద్ధగా పరిశీలించి దేవనూరు ప్రాజెక్టును irrigation purposes కు ఉపయోగించి మెదక్ జిల్లాను సస్యశ్యామలం చేయాలని కోరుతున్నాను. ఆ విధముగాచేసి మెదక్ జిల్లా ప్రజలకు, రైతాంగానికి సర్వవిధాల ప్రభుత్వం సహాయము చేయాలని మనవిచేస్తున్నాను. నేను ఇంతటితో సెలవు తీసికొంటున్నాను.

శ్రీ పి. వెంకటసుబ్బయ్య (రాజంపేట—రిజర్వుడు) :—అధ్యక్షా, నేను ఈ ఇర్రిగేషను డిమాండును బలపరుస్తూ కొన్ని విషయాలు మంత్రిగారి దృష్టికి తీసుకురాదలచుకున్నాను. 3 కోట్లు ఖర్చుపెట్టి కె. సి. కెనాల్‌ను మరమ్మతు చేస్తామని ప్రభుత్వం ప్రకటించిన తరువాత కర్నూలు—కడప వాసులమైన మేము చాలా ఆనందించాము. అయితే ఇప్పటికి 4 కోట్లు ఖర్చుచేసి ఆ కాల్వలో 75 మైళ్ళు మాత్రమే మరమ్మతు చేశారు. దానివల్ల ఇప్పుడు నీరు తక్కువ అయిపోయింది. దానికి కారణం ఏమిటో ప్రభుత్వం దర్యాప్తు చేయాలని మనవి చేస్తున్నాను. 75 మైళ్ళు మరమ్మతు చేయటానికి సుమారు 4 కోట్లు ఖర్చు అయినది. ఇంకా 191 మైళ్ళు కాలవను మరమ్మత్తు చేయటానికి సుమారు 3 కోట్లు అవుతుందని అక్కడి ఇంజనీర్లు అంచనా వేసినట్లు తెలుస్తోంది. ఈ మొత్తమును కూడా శాంక్షన్‌చేసి ఆ కాలువను అభివృద్ధిచేస్తేకాని కడప జిల్లా వాసులకు ఎటువంటి లాభములేదని మంత్రిగారికి నేను మనవి చేస్తున్నాను. ఆ కాలువనుండి నీరు సప్లై కావటానికి రాజోలువద్ద ఒక ఆనకట్ట ఉన్నది. అది కుందు నదిపైన ఉన్నది. అక్కడ ఇంకా ఎత్తునుపెంచి వెడల్పుచేస్తే నీరు బాగా సప్లైకాగలదు. పెన్నానది కలిసేది నివ్వాయిపల్లె యొద్ద ఇంకో ఆనకట్టవుంది. దానిని పెంచి, కాలువను మరమ్మతో చేసి స్లూయిస్‌ను రిపేరుచేస్తే ఎక్కువ నీరు రావటానికి అవకాశము ఉంటుంది. కడప జిల్లా వాసులకు కూడా దానివల్ల ప్రయోజనము ఉంటుంది. భూమి ఆయకట్టు పెంచటానికి లోకలైజేషన్ డిపార్టుమెంటును ఒకదానినివేసి, దానిద్వారా అందరికి నోటీసులు పంపించటం జరిగింది. "మీకు 'దోఫసలీ' కి నీరు సప్లయి చేస్తాము. పన్ను హెచ్చించినా మీరు సిద్ధంగా ఉండాలని" నోటీసులు జారీచేశారు. మాకు హుకుం అందింది కనుక నీరుకట్టుకొనే హక్కు మాకువుంది అని రైతులు ఆయకట్టు పెంచుకొని నీటిని ఎక్కువగా upper reaches లో భూములకు పారుదల చేసుకొంటున్నారు. అందుచేత పాత కడపకు ప్రతి సంవత్సరము వచ్చే నీటికంటే తక్కువగా ఉంది. అందువల్ల ఈ సంవత్సరం అక్కడ పైరు అంతా నష్టపడింది. ముఖ్య మంత్రిగారు అక్కడకు వచ్చినప్పుడు విజ్ఞప్తిచేశాము. ఈ విషయము సమగ్రముగా ఆలోచించాలి. ఆ ప్రాంతమును సస్యశ్యామలము చేయాలంటే, డబ్బు ఇంకా ఎక్కువ ఖర్చు అయినాసరే ఈ కాలువను అభివృద్ధి చేయాలి. రాజంపేట తాలూకా లో వర్షాలులేక, చెరువులలో నీరు లేక పైరులు ఎండిపోయాయి. రాజంపేట తాలూకా లో కోడూరు దగ్గర గుంజన అనే నది ఉన్నది. ఆ నదికి ఆనకట్ట కట్టుటకు ఇదివరకే శాంక్షను అయినది. ఎక్కువ డబ్బు కూడా ఖర్చుకాదు. ఆడబ్బు ఖర్చుపెట్టి ఆ ఆనకట్టను పూర్తిచేస్తే ఆ ప్రాంతానికి లాభదాయకంగా ఉంటుందని మనవి చేస్తున్నాను. రాజంపేట

తాలూకాలో పుల్లంపేట ఉంది. అక్కడ పుల్లంపేట కాలువవుంది. ఆ కాలువనుంచి చెరువుకు నీరు తరలించితే అక్కడ కొంత ప్రాంతములో పైరులు వేయటానికి అవకాశము ఉంటుంది. ఆ కాలువ పూడిపోయింది. దీనిని మరమ్మత్తు చేయిస్తే రాజంపేట తాలూకా వాసులకు కొంత లాభదాయకంగా ఉంటుంది. రాజంపేట తాలూకాలో తోగురుపేట ప్రాజెక్టుకు, రాగేటుకాన అనే ప్రాజెక్టుకు **investigation** పూర్తి అయినది. అవి గవర్నమెంటుకు చేరినా ఇంకా పని ప్రారంభించలేదు. మైనర్ ఇరిగేషన్ వర్క్సును అయినా శ్రద్ధతో పరిశీలించి, వాటిని అమలుపర్చటానికి ప్రయత్నించితే ప్రజలకు కొంత లాభదాయకంగా ఉంటుందని మీ ద్వారా ప్రభుత్వానికి తెలియజేస్తూ ఇంతటితో సెలవుతీసుకొంటున్నాను.

*శ్రీ జె. కొండలరావు (వేమసూరు):—అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ డిమాండును బలపరుస్తూ వారికి కొన్ని విషయాలను మనవిచేసుకొంటున్నాను. మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము ముఖ్యముగా వ్యవసాయము మీద ఆధారపడి ఉన్నది. మన ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రకృతి ఇచ్చిన జలసంపదలు అనేకము ఉన్నాయి. ఇంత సారవంతమైన భూములువున్నా ఆంధ్ర ప్రదేశ్ వందల కోట్ల రూపాయలు ఖర్చుచేసి ఇతర రాష్ట్రాలనుండి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకొంటున్నది మన రాష్ట్రములోవున్న ఈ ప్రకృతి సంపదను సరిగా వినియోగించుకొన్నట్లయితే మన వ్యవసాయ శాఖా మంత్రిగారు చెప్పినట్లు మొత్తం భారత దేశానికే మనం **foodgrains** సప్లయి చేయగలుగుతాము. ముఖ్యంగా మా ఖమ్మం జిల్లాలో జలాధారాలు చాలా ఉన్నాయి. పురాతనమైన కుంటలు, బ్రహ్మాండమైన చెఱువులు, అరణ్యాలలో వేనకువేలు ఉన్నాయి. తమ్మిలేరు, ఎర్రకాలువ, బుడమేరు, ఇంకా అనేక కొండవాగులు మా ఖమ్మం జిల్లాలో పుట్టాయి. కాని ఈనాడు నీటి ఆధారములేక పైరులు నాశన మవుతున్నాయి. కొండవాగుల ద్వారా ప్రవహించే నీటిని సక్రమంగా వినియోగించటంలేదని మీ ద్వారా మంత్రి వర్గానికి చెప్పదలచుకొన్నాను. మా ప్రాంతములో ఏఏ చెరువులకు గళ్ళుపడ్డాయో విచారించి, వాటిని రిపేరు చేయిస్తే ఎన్నో వందల ఎకరాలను సాగులోనికి తీసుకురావటానికి అవకాశం ఉంటుంది. ఈనాడు వ్యవసాయ డిపార్టుమెంటు కూడా సక్రమ పద్ధతిలో రైతులకు కావలసిన విత్తనములు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు సకాలములో అందచేస్తే, వారు వ్యవసాయమును ఇంకా ముందుకు తీసుకుపోగల్గుతారని మనవిచేస్తున్నాను. తమ సర్వస్వాన్ని ధారపోసైనాసరే వ్యవసాయమును అభివృద్ధి చేయాలని రైతులు కుతూహలపడుతున్నారు. కాని ప్రకృతి కారణాలవల్ల, ఆర్థిక బాధవల్ల అనుకున్న ప్రకారముగా రైతు అధికోత్పత్తిని సాధించలేకపోతున్నాడు. ఖమ్మం జిల్లాలోని మా నియోజక వర్గంలో పైరా అనే ప్రాజెక్టువుంది. ఆ ప్రాజెక్టుకు సంబంధించివున్న 20 గ్రామాలలోని రైతులు ఈ 10, 15 సంవత్సరాలలో గవర్నమెంటునుండి 9 లక్షల రు. లు అప్పు క్రింద తీసికోవటం జరిగింది. ఆ అప్పును సక్రమంగా గవర్నమెంటుకు తీర్చాలనే ఉద్దేశ్యములోనే తీసుకోవటం జరిగింది. కాని ప్రకృతి వైపరీత్యమువల్ల వారు చెల్లించలేకపోయారు. ఒకేసారి 9 లక్షల రూపాయలు కట్టాలంటే చాలా కష్టమైనపని. ప్రభుత్వం ఆ విషయమును ఆలోచించి, వాయిదాల రూపమున వసూలుచేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. మా ప్రాంతపు సరిహద్దువరకు మాచ్‌కండ్ ఎలక్ట్రిసిటీ స్కీము వచ్చింది. గౌరవనీయులైన మన ఇర్రిగేషన్ మంత్రిగారు ఈ మధ్య ఒక ఉపన్యాసములో మాట్లాడుతూ 'ఆంధ్రలో సుమారు 200 గ్రామాలకు, తెలంగాణాలో 10 గ్రామాలకు కరెంటు ఇవ్వబడిందని' తెలియచేశారు. అంటే తెలంగాణాలో ఎలక్ట్రిసిటీ

వ్యవహారములో చాలా వెనుకబడి యున్నది. కరెంటు సహాయముతో తెలంగాణాలోయున్న ప్రకృతి సంపదను సద్వినియోగ పర్చుకొని వ్యవసాయాభివృద్ధి చేయవచ్చును. కనుక మాప్రాంత సరిహద్దు వరకు వచ్చిన కరెంటును తప్పకుండా మా ప్రాంతానికి కూడా ఇచ్చినట్లయితే, మా ప్రాంతము కూడా ముందుకు పోగలదని మంత్రివర్గానికి చెబుతున్నాను.

అదీకాకుండా రహదారుల విషయములో ఈనాడు మాప్రాంతం చాలా వెనుకబడియున్నది. మాప్రాంతంలోని కొన్ని గ్రామాలకు సంవత్సరానికి 5, 6 నెలలు మాత్రమే బయటి ప్రపంచంతో సంబంధంవుంటుంది. మిగిలిన రోజుల్లో ఆ గ్రామాలలోనికి వెళ్ళాలన్నా, అక్కడనుంచి బయటకు రావాలన్నా చాలా కష్టమవుతున్నది. ఈ విషయమై ప్రభుత్వం శ్రద్ధ తీసుకుని వెంటనే రహదారి సౌకర్యాలు కలిగించవలెనని కోరుతున్నాను. General Administration లో మాకు చాలా weakness కనబడుతోంది. ప్రభుత్వంలోని చాలామంది ఉద్యోగస్థులు ఇంకా పాత పద్ధతులనే అనుసరిస్తున్నారనే విషయం ప్రభుత్వం వారికి జ్ఞాపకం చేస్తున్నాను. వారు "మనం ఈనాడు ప్రజా ప్రభుత్వంలో ఉద్యోగం చేస్తున్నాము; మన బాధ్యతలు ఏమిటి, ప్రజల అవసరాలను తీర్చడానికి మనం ఏ విధంగా కృషిచేయాలి" అని ఆలోచిస్తున్నట్లు కనబడదు. ఒక్కనాటి రాత్రిలో ఈ ఉద్యోగులనందరినీ సత్యహరిశ్చంద్రునివలె మార్చగలమని నేను చెప్పలేను. కాని లంచగొండితనం ఎక్కువ అవుతున్నదే కాని తగ్గడం లేదని మాత్రం చెబుతున్నాను. ఈ విషయమై ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకొనకపోతే అనేక విషమ పరిణామములు సంభవించి ప్రభుత్వం ఏమైపోతుందో అనే అనుమానం కల్గుతున్నది. అందువల్ల రాష్ట్ర స్థాయిలోనూ, జిల్లా స్థాయిలోనూ కూడా అధికార, అనధికార సభ్యులతో Anti-corruption Committees నియమించి check-up చేయించేందుకు ఏర్పాటు చేయవలసిందని ప్రభుత్వానికి సవినయంగా మనవి చేస్తున్నాను.

ఈనాడు కొన్ని జిల్లాలలో, ఆ జిల్లాలోని వారే ఉద్యోగస్థులుగా ఉండడం జరుగుతున్నది. తాలూకాలలో కూడా చాలామంది స్థానికులే ఉద్యోగాలలో వుంటున్నారు. కాబట్టి ఏ యే జిల్లాలలో స్థానికులు ఉద్యోగాలలో వున్నారు అనే దానిని గురించి ప్రభుత్వం భోగట్టా తెప్పించి అటువంటి వారిని ఆ జిల్లాలనుంచి ఇంకో ఇతర జిల్లాలకు transfer చేయాలని మనవి చేస్తున్నాను.

ఇక irrigation facilities కలిగించే విషయంలో corruption ఎక్కువగా వున్నది. కంట్రాక్టరులు, కొంతమంది ఉద్యోగస్తులు లాలోచీ పడి ప్రభుత్వాన్ని మోసం చేసి, నిర్ణయించబడిన estimates ప్రకారం కార్యక్రమం తీసుకోకుండా వుండడం జరుగుతున్నది. 100 రూపాయలు కాంట్రాక్టు అయితే 5 రూపాయలు లేక 200 రు. కంట్రాక్టు అయితే 10 రూపాయలు ఇస్తామని ఏదో వారిలో వారు మాట్లాడుకొని అసలు కార్యక్రమాన్ని సక్రమంగా జరగకుండా చేయడం జరుగుతున్నది.

ఇంక అడవుల విషయంలో, ప్రతి సంవత్సరమూ, కొన్ని కూపులను contract కు యివ్వడం జరుగుతోంది. ప్రకృతి సంపదయిన ఈ అడవుల విషయంలో కూడా అటవీ శాఖోద్యోగస్థులు, కంట్రాక్టరులు లాలోచీపడి రిజర్వు ఫారెస్టును కూడా కొట్టించు

ఇవ్వడం జరుగుతోంది. అడవులు నాశనమై పోతున్నాయని కొంతమంది ప్రభుత్వానికి రిపోర్టు చేశారు. Special Survey Party వచ్చి పరిశీలన చేయగా కొన్ని లక్షల చెట్లు కొట్టివేయబడినట్లు తెలిసింది. దానిమీద ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకున్నదో ఇంతవరకూ నాకు తెలియదు. కాబట్టి ఈ విషయమై తగు పరిశీలన చేసి, ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకుంటుందని ఆశిస్తున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—మహాశయా, ఈ బడ్జెటు డిమాండుమీద నేను నాలుగు మాటలు చెప్పదలచాను. ఇర్రిగేషనుకు సంబంధించిన విషయాలు వచ్చినప్పుడల్లా మైనర్ యిరిగేషన్ విషయమై ప్రభుత్వం వారి శ్రద్ధ తక్కువగా ఉన్నదని మనవి చేస్తూనే యున్నాను. అయితే ఇదివరకు estates గా వుండి ఇప్పుడు ప్రభుత్వంచే తీసుకోబడిన ప్రాంతాలలో Estate Land Act వల్ల ఏ విధంగా జరిగినదో మీకు చక్కగా తెలుసును. ఆ సంస్థానాల లోని చెఱువులను ఎప్పుడో కొన్ని శతాబ్దాల క్రితం బాగుచేశారేకాని, ఈ మధ్య బాగు చేయించ లేదు. ఆ చెఱువులన్నీ పాడు పడిపోయే స్థితిలో ఉన్నాయి. ఈ విషయం తమకు బాగా తెలుసు. ఆ ప్రాంతంలో అనేక వాగులు కొండ వాగులు ఉన్నాయి. "మనకు స్వాతంత్ర్యం వచ్చింది. జమీందారులు పోయారని" చాలామంది రైతులు సంతోషించారు. పన్నులు తగ్గి పోతాయని, ఆ చెఱువులన్నీ చక్కబడతాయనీ, వాగులుండే చోట్ల చిన్న చిన్న కట్టలు వేసి, చెఱువులు త్రవ్వించి, కొత్తగా నీటిపారుదల వసతులు కల్పిస్తారని ఎంతో ఆశతో సుమారు ఏడు ఏండ్లుగా నిరీక్షిస్తున్నారు. Estates Abolition Act pass అయి చాలాకాలం అయినా కూడా, ఇంతవరకూ అధమం ఒక చిన్న స్కీము అయినా చేసినట్లు ఎక్కడా కన్పించుట లేదు. రెవిన్యూ డిపార్టుమెంటువారు ఇప్పుడే కొన్ని కొన్ని చెఱువులకు repairs చేయించటం ఆరంభించినారు. అసలు ఏమీ చేయుటలేదని చెప్పడానికి వీలులేదు. అయితే కొన్ని plans ప్రకారం ఈ చెరువుల మరమ్మతులు తీసుకోవచ్చును. నా నియోజక వర్గంలో ఒక చిన్న కాలవ, కట్ట వేసినట్లయితే యించుమించు 100 ఎకరాలకు నీటి వసతి కల్పించవచ్చు. ఈ రకమైన సౌకర్యాలు కల్గించాలని అనేక చోట్లనుంచి మాకూ, మంత్రులకు కూడా విజ్ఞప్తులు వస్తున్నాయి. కాబట్టి దీనిని గురించి ప్రభుత్వంవారు ఒక plan వేసుకొని ముఖ్యంగా ఎస్టేటు ప్రాంతాలలో అవకాశమున్నచోట్లల్లా మైనర్ ఇరిగేషన్ స్కీముల్ని ప్రారంభించాలి. అసలు plans వేసుకొని, సిబ్బందిని నియమించి, సరైన విచారణ జరిపి స్కీములు తయారు చేసినట్లయితే ఇప్పుడు డబ్బు లేక పోతే, డబ్బు వచ్చినప్పుడే ఈ కార్యక్రమం చేసుకోవచ్చు. కాని ఆ విధమైన Planned Schemes ఎక్కడా కనబడడంలేదు. నా నియోజకవర్గానికి మంత్రిగారిని తీసుకొనివెళ్ళి చూపించాను. అది కేవలం అడవిప్రాంతం. అక్కడ మనిషి సంచారం లేదు. Interior లో వున్నది. అక్కడి భూములు వర్షాధారాలే కాని మరేఇతర సౌకర్యమూ లేదు. అక్కడ ఒక చిన్న కాలవ ఉన్నది. దానికి కట్ట వేసినట్లయితే దాదాపు 80 ఎకరాలు సాగౌతుంది. అది చేయాలని మంత్రిగారికి చెప్పాము. దానిని గురించి మూడు ఏండ్లనుంచి ప్రయత్నం చేస్తున్నాము. మంత్రిగారు చూచారు. Estimates తయారు చేయమన్నారు. తయారు చేయించాము. మంత్రిగారు రైతులను పిలిపించి విచారించారు. ఆ తరువాత ఒక అడ్డంకి వచ్చినది. దీనికి estimates 50,000 రూపాయలు అవుతుంది సాగయ్యేది 80 ఎకరాలు మాత్రమే. దీనివల్ల వచ్చే ఆదాయం చాలా

తక్కువ కాబట్టి ఇంత తక్కువ ఆదాయం వచ్చే స్కీమును తీసుకోవడం ప్రభుత్వానికి సాధ్యం కాదని చెబుతున్నారు. అయితే మనమేదైనా పని చేసినప్పుడు దాని వల్ల వచ్చే డబ్బు ఆదాయమా? లేక ప్రజల యొక్క సౌకర్యం, సుఖం, ఆదాయమా? బ్రహ్మాండంగా ఏ 100 కోట్ల రూపాయలో ఖర్చుచేసే పెద్ద ప్రాజెక్టు అయితే, ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తున్నాము, తరువాత దీనివల్ల ఆదాయం వస్తుందా, రాదా అనేది ఆలోచించడం న్యాయం. అంతే కాని సామాన్యమైన ప్రజలకు జీవనానికి ప్రధానమైన చిన్న స్కీముకు లక్ష రూపాయలలో చేయాలంటే, మాకు ఏమి ఆదాయం వస్తుంది అనడం చూస్తే ప్రభుత్వం చేసేది వ్యాపారమా?

మైనరు ఇరిగేషన్ స్కీములకు డబ్బు ఖర్చు పరచే సందర్భములో ప్రజలకు ఎంత సౌకర్యము కలుగుతున్నది అనే విషయమే చూడాలికాని నూటికి 10 రూపాయలు ఆదాయము వస్తుందా; 5 రూపాయలు ఆదాయము వస్తుందా అనేటటువంటి పద్ధతులకు ప్రాధాన్యం యివ్వకూడదని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. బొత్తిగా జలాధారములు లేనివి ఎంతోదుస్థితిలో ప్రజలు బాధలు పడుతున్న ప్రాంతములలో నీటి వసతులు రాబడి లెక్కలను ఒక్కసారి ఆ పేద ప్రజానీకానికి కలిగే సౌకర్యాలను దృష్టిలో వుంచుకొని పథకాలను అమలు చేయడము పరమ ధర్మము. ఈ విధంగా సౌకర్యాలు కలుగచేసినపుడే ప్రజలు పన్నులను సంతోషంగా ఇస్తారు. అంతేనే కాని జీవనాధారాలు లేని ప్రాంతాలలో 25 వంతులు చెల్లించండి, 37 వంతులు చెల్లించండి అని చెప్పినందువల్ల ప్రయోజనం వుండదు. ప్రభుత్వానికి వచ్చే రాబడిని ప్రధానంగా చూసుకోవడం కంటే పేద ప్రజల సౌకర్యాలకే ప్రాముఖ్యమివ్వాలని తెలియచేస్తున్నాను. మా ప్రాంతములో గాడంగి స్కీము అనే దానిని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం కాలంలో ఇన్‌వెస్టిగేట్ చేశారు. దానిని ఇదివరకే రెవిన్యూ డిపార్టుమెంటు వారికి పంపించారు. రెవిన్యూ డిపార్టుమెంటువారు దానిని పరిశీలించి అది ఆచరణయోగ్యమైనదని అంగీకరించారు. కాని ఇంతవరకు అమలుచేయబడలేదు. ఈవిషయాన్ని ప్రశ్నల పూర్వకంగా జాబుపూర్వకంగా కూడా మంత్రిగారి దృష్టికి తీసుకొని వచ్చినా ఇంతవరకూ అది అమలు జరుపబడలేదు. అది చాలా ముఖ్యమైన స్కీము. 10, 15 గ్రామాలకు దానివల్ల లాభము కలుగుతుంది. ముఖ్యమంత్రిగారు ఈ స్కీమును త్వరలో అమలు చేయించ వలెనని కోరుతున్నాను.

*శ్రీ పి. నరసింగరావు :—అధ్యక్షా, ఈ అనుబంధము పద్దులపై మాట్లాడే సందర్భములో రెండు విషయములను తమద్వారా సభవారి దృష్టికి తీసుకొని రాదలచుకున్నాను. (1) ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటు యొక్క నిర్వహణ విధానము, (2) ఈ డిపార్టుమెంటులో కార్మికులపట్ల ప్రభుత్వము అనుసరిస్తున్నవిధానము.

గత బడ్జట్ సమావేశమున ఈ ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు గురించి, ఈ ఇరిగేషన్ డిపార్టుమెంటును గురించి, అటు ట్రెజరీ బెంచినుంచి, ఇటు ప్రతిపక్షం వైపునుంచి ఎన్నో విమర్శలు వచ్చాయి. ఆ డిపార్టుమెంట్లలో జరుగుతున్న గందరగోళాలు, లంచగొండితనం అవినీతి గురించి చాలామంది సభ్యులు చెప్పారు. ఈ మధ్యన కూడా కొన్ని మాసములనుండి ఇక్కడ హైదరాబాదునుంచి వెలువడే 'నవశక్తి' అనే వారపత్రిక సీరియల్‌గా ఈ ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటులో, ముఖ్యంగా ఛీఫ్‌ఇంజనీరుగారు చేస్తున్న అన్యాయాలను గురించి ఒహిరంగంగా వార్తలు పబ్లిష్‌చేస్తూ వచ్చినది. ఆ వార్తలు చదివినవారికి ఎంతఘోరమైన అన్యాయాలు జరుగుతున్నవో

బోధపడుతుంది. అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నప్పుడు కండ్లు ఉండికూడా చూడడము లేదో, చెవులు ఉండికూడ వినడములేదో తెలియడములేదు. ఒకవేళ ఆ పత్రికలో ప్రకటింపబడిన విషయములు తప్పు అయినట్లయితే శాసనం ప్రకారముగా ప్రభుత్వం చర్యతీసుకోడానికి అవకాశ మున్నది. కాని అటువంటి చర్య ఇంతవరకు తీసుకొనబడలేదు. ఈ శాఖలో సంవత్సరానికి 10, 12 కోట్ల రూపాయలు చొప్పున ఖర్చుపెట్టుతున్నారు. ఆ శాఖలో ఎన్నో గందర గోళములు జరుగుతున్నాయి. ఈ మధ్యన పది, పన్నెండు లక్షల రూపాయల విలువగల జనరేటర్లు తెప్పించుటకు కేవలం 10 రోజులే గడువు ఇచ్చి 1, 2 పత్రికలలో మాత్రమే ఎడ్వర్ టైజ్ చేయడం జరిగింది. అందువల్ల బయట దేశములోని కంపెనీలు కొటేషన్లు ఇవ్వడం లేకపోవడం ఛీఫ్ ఇంజనీరుగారి మిత్రులకు సంబధించిన కంపెనీలవారు హైరేట్సు కోట్ చేయడం జరిగింది. ఇటువంటి విషయములను పత్రికలద్వారా, పుస్తకముల ద్వారా ప్రచారం చేయడం జరుగుతున్నది. ప్రభుత్వము వారి ఇన్ఫర్మేషన్ డిపార్టుమెంటువారు ఈ వార్తలను ప్రభుత్వము యొక్క దృష్టికి తీసుకు రావలసి యున్నది. ఐనప్పటికి వాటినిగురించి ఎందుకు శ్రద్ధతీసుకోరు? ఆ వార్తలు తప్పు అని ఎందుకు డినైచేయరు? తప్పుడు ప్రచారముచేసిన పత్రికలమీద ఎందుకు యాక్షన్ తీసుకోరు?

మిస్టర్ స్పీకర్ :—'నవశక్తి' పార్టీ పత్రికా.

శ్రీ పి. నరసింగరావు :—అది మా పార్టీ పత్రికకాదు. అది ఒక బాధ్యతగల పత్రిక.

మిస్టర్ స్పీకర్ :—బాధ్యతగల పత్రికకాదని మాత్రము నేను చెప్పగలను. గవర్నమెంటు వారు దానిని చూడకపోవడానికి చాలా సంతోషిస్తున్నాను.

శ్రీ పి. నరసింగరావు :—తమ దృష్టిలో కావచ్చు. ఒకవేళ అందులో వెలువడ్డ వార్తలు తప్పు అయినట్లయితే ఆ పత్రికపై యాక్షన్ తీసుకోవాలని నేను కోరుతున్నాను.

శ్రీ ఎన్. సంజీవరెడ్డి :—ఎవరో, ఏదో వ్రాస్తూంటే దానిపైన చర్యతీసుకోవడం మొదలు పెడితే అదే సరిపోతుంది. ఎవరి పార్టీ పత్రికలలో వారిని బలపర్చుకోవడం నిమిత్తం ఇతరులను తిడుతూ ఉంటారు. అది పార్టీల తరఫున డినైచేయవచ్చు. కాని ప్రభుత్వం తరఫున చేయడం మంచిదికాదు.

మిస్టర్ స్పీకర్ :—అది పార్టీ పత్రిక కాదు అన్నారు. అది చాలా సంతోషం. ఆ పిచ్చి పత్రిక మాటవద్దు. నరసింగరావుగారు అసలు విషయమును గురించి చెప్పవలెనని కోరుతున్నాను.

శ్రీ పి. నరసింగరావు :—ఆ పత్రికలో చెప్పిన విషయముల గురించి ప్రస్తుతానికి వదలిపెడ్దాము. గత సమావేశములో ఎ. సి. సుబ్బారెడ్డిగారు మరి కొందరు కాంగ్రెసు సభ్యులు కూడా ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటులో జరుగుతున్న అక్రమాలను గురించి చెప్పారు. అయినప్పటికీ వాటిని గురించి చర్య తీసుకోకపోవడం చాలా విచారించవలసిన విషయం. కోట్ల కొలది రూపాయలు ఈ శాఖలో వృధాగా ఖర్చుచేయబడు చున్నవి? ఆ ఖర్చులలో పొదుపు చేయకుండా ప్రజలను 'పొదుపుచేయండి' అని అంటే అదెలా సాధ్యమవుతుంది. ఆ ఖర్చులను తగ్గించుటకు 'ప్రయత్నం' చేయకపోవడం చాలా శోచనీయమైన విషయం. ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటుకు సంబంధించినంతవరకూ మంత్రి గారు ఎంత శ్రద్ధగా నడిపిస్తున్నారో దీనివల్ల స్పష్టమవుతున్నది.

ఎలెక్ట్రిసిటీ శాఖలో పనిచేస్తున్న కార్మికులలో అనైక్యతను రెచ్చగొట్టటానికి, పోటీ సంఘాలను పెట్టించి వారి న్యాయమైన కోర్కెలను అణచటానికి సమయమున్నది. గాని లంచగొండి తనాన్ని, అవినీతిని కార్మికులలో అనైక్యతను నిర్మూలించడానికి వారికి అవకాశములేదు. హైదరాబాదులో ఎలెక్ట్రిసిటీ వర్కుషాపు కార్మికులు గత 5, 6 సంవత్సరములనుంచీ వారి వేతనములను వృద్ధిచేసే విషయంలో పోరాటం సాగిస్తున్నారు. 1949 లో పోరాటము సాగించారు. 1953 లో హాలీసిక్కా మార్చబడినప్పుడు కూడా బ్రహ్మాండమైన పోరాటము సాగించారు. అప్పుడు హరిహరనాధ శాస్త్రిగారు, రామానందతీర్థగారు జోక్యము కలిగించుకొని వేజ్ కమిటీనివేసి వాటి నిర్ణయాలను అమలులోకి తెచ్చేటట్లు చూస్తామని హామీ ఇచ్చారు. అవిధంగా కమిటీలు కూడా వేశారు. కాని కమిటీ రిపోర్టు 6 నెలలలో ఇస్తామన్నా 2 సంవత్సరముల వరకూ అది జరుగలేదు. దానిని అమలు జరుపనందుకు 1956 లో కార్మికులు సమ్మె చేసినప్పుడు వేజ్ కమిటీలను నిర్మిస్తామని రామకృష్ణరావుగారు చెప్పారు. ఆవిధంగా కమిటీలను వేశారు. ఆ కమిటీలు మూడు మాసములలో నివేదికలు సమర్పించినవి. కాని దానిపై చర్య తీసుకోబడలేదు. గత సంవత్సరం అక్టోబరు 30 వ తారీఖున పి.డబ్ల్యు.డి., కార్మికులు సమ్మె జరుపుతున్నప్పుడు శ్రీ సంజీవరెడ్డిగారు, శ్రీ జె. వి. నరసింగరావుగారు కార్మికులను సమ్మె విరమించుకోవలసినదిగా కోరినారు. ఆంధ్రప్రదేశ్ అవతరణ శుభ సమయములో ఆ కార్మికులు సమ్మె జేయరాదని, వారి కోరికలను సానుభూతితో ఆలోచిస్తామని వాగ్దానంచేశారు. కాని ఇంతవరకు కార్మికులకు ఉపకారము జరుగలేదు. ఈ మధ్యన 6 రు. లు కరువు బత్తెం అదనంగా వారికి శాంక్షన్ చేయబడినప్పటికినీ, దానిని తిరిగి వాపసు తీసుకొనడం జరిగింది.

10, 12 సం.ల నుండి ఎలక్ట్రిసిటీ శాఖలోని కార్మికులకు మజ్దూర్ సంఘాన్ని రికగ్నయిజు చేసివున్నారు. అది అప్పటినుండి పనిచేస్తూనే ఉన్నది. కార్మిక మంత్రిగారు ఒక ఇండస్ట్రీలో ఒకే యూనియన్ ఉండాలని చెబుతున్నప్పటికీ, కార్మిక నాయకులు ఇండస్ట్రీయల్ ట్రూస్ కావాలని అంటున్నప్పటికి ఆ కార్మికులలో పోటీ యూనియన్‌ను స్థాపించడం జరుగుతున్నది.

ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటుకు బాధ్యతగల మంత్రిగారు, యింకొక యూనియన్ పెట్టుకొన వచ్చునని దానికొక ఆఫీసు యివ్వడంవల్ల కార్మికులలో అసంతృప్తి, కొట్లాటలు, దెబ్బలాటలు జరుగుచున్నవి. ఈ, విధంగా కార్మికుల ఐక్యతను విచ్ఛిన్నం చేయటానికి ఈ ప్రభుత్వం అవలంభిస్తున్న విధానం సరైనదికాదు. ఒకవైపు ప్రణాళికను విజయవంతం చేయాలనుకుంటూ యింకొకవైపు ద్వంద్వ విధానం అవలంబిస్తే ఫలితాలు చెడుగా ఉంటాయి. ఇది సహజం. ఈ సందర్భంలో నేను కోరేది, ప్రభుత్వ డిపార్టుమెంట్సులో **wastage, corruption** దూరం చేసి, పొదుపరితనం ప్రభుత్వంవారు అలవరచుకొనవలెనని కోరుతున్నాను. కార్మికులకు కనీస వేతనాలు, కనీస సౌకర్యాలు కలిగించకుండా ఉండటం సంమంజసమైన విషయంకాదు. వారి కనీస అవసరాలు పూర్తి చేయటానికి పూనుకొనవలెనని కోరుతున్నాను. దానితోబాటు (ఒకటే ఇండస్ట్రీలో ఒకే యూనియన్ ఉండాలనే సూత్రం పాటించాలి) అని యిక్కడి మంత్రులేకాదు, కేంద్ర ప్రభుత్వ కార్మిక శాఖామంత్రిగారుకూడా అంటూ ఉంటారు. ఈ సిద్ధాంతాన్ని అమలులో పెట్టాలి. పోటీ యూనియన్లను పెట్టి, ఏదో కొద్దిమందిని పెట్టుకొని తమ స్వార్థముల కొరకు తమ స్వంత ఉపయోగాలకొరకు, స్వంత రాజకీయాలకొరకు ఉపయోగించుకొంటూ కార్మికులలో అనైక్యతను రెచ్చకొట్టవద్దని తమద్వారా మనవిచేస్తూ సెలవుతీసుకొంటున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—అధ్యక్షా, ఇర్రిగేషన్, ఎలెక్ట్రిసిటీ ఈ రెండు చాలా ప్రధానమైన విషయాలు. వీటిమీద అనేకమంది మాట్లాడాలని కుతూహలపడతారు. ఈనాడు కూడ చాలామంది మాట్లాడటానికి ఉత్సాహం చూపించారు. అనేక విషయాలు చెప్పారు. **P.W.D.** లో కరప్షన్ ఉన్నదని, అది ముందు నివారించమని, స్మాల్ సేవింగ్సు ఉద్యమంకన్నా ముందు **P.W.D.** లో సేవింగ్సు చూపించమని సభ్యులు చెపుతున్నారు. దాని విషయమై వీలైనంత చర్య గవర్నమెంటువారు తీసుకుంటున్నారు. ఎస్టిమేట్సు కమిటీవారు కూడ ఆ విషయమై శ్రద్ధగా పని చేస్తున్నారు. ఇంకా మనం అనుభవం గడించవలసియున్నది. **P.W.D.** గురించి కొత్తగా చెపుతున్న విషయంకాదు. మద్రాసులోగాని, కర్నూలులోగాని, యిక్కడకు వచ్చిన తరువాతకూడ, **P.W.D.** లోని విషయాలు చెప్పటం, మేము ప్రయత్నం చేయటమేగాని, కడపటికి అందులో తగ్గించటానికి వీలులేని పరిస్థితులు అనేకం ఉంటున్నవి. ఎస్టిమేట్సు కమిటీలో సుందరయ్యగారు, యితరులు, తుంగభద్ర కాలువగురించి, కృష్ణాబారేజిగురించి, యీ విషయాలన్నీ చర్చించుతూ ఉన్నందుకు సంతోషం. కాని అవకతవకలు జరుగుతున్నవని "నవశక్తి" లో వచ్చిన విషయాలకంతకూ ప్రభుత్వం ఎందుకు చర్య తీసుకొనదని అడుగుట న్యాయంకాదు. అనేక పత్రికలలో అనేక విషయాలు చెబుతూ ఉంటారు. వాటిని ఖండించటంగాని, ప్రాసిక్యూట్ చేయటంగాని కుదరదు.

మిస్టర్ స్పీకర్ :—'నవశక్తి' నన్నుకూడ (మీస్పీకరును) తిడుతున్నది కాబట్టి దాని విషయం మెన్షన్ చేయకుండా ఉంటే సంతోషం. నేను ఏమిచేయను ? I am helpless. నన్ను రోజూ 'నవశక్తి' తిడుతున్నది—మీ స్పీకరుయొక్క గౌరవం పోగొట్టుతున్నది గనుక దానిని గురించి చెప్పకండి. అందులో 'నవశక్తి' !—the most vulgar paper in Andhra.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :— Glaring instances వుంటే ఆ మంత్రిగారికి గాని, చీఫ్ మినిస్టరుగారికిగాని చెప్పవచ్చును. ఆర్థికంగా దుబారా జరుగుచున్నది, దానిని తగ్గించుటకు వీలుంటుంది అంటే—అది ఫైనాన్సు మినిస్టరుకు వ్రాయవచ్చును. మేముకూడ, **P.W.D.** లో దుబారా తగ్గించవలెనని ఆసక్తిగా ఉన్నాము. మేము ఎన్నోసార్లు ప్రయత్నం చేశాము. అది టెక్నికల్ శాఖ. మద్రాసులోకూడ, శ్రీ రామస్వామిరెడ్డియార్ చీఫ్ మినిస్టరుగా ఉన్నప్పుడు, ఆ శాఖలో ఏమైనా చేయుటకు వీలవుతుందేమోనని బ్రహ్మాండంగా ప్రయత్నం చేశాము. కాని ఏమీ చేయలేకపోయినాము. ఈ శాఖ విషయం చాలా రోజులుగా వస్తున్నది. రాజాజీ గారు దీనిని నెం. 2 ఎనిమీ అన్నారు. కాని ఆ శాఖకు వుండే difficulties, labour costs, యివన్నీ చూస్తే, ఏమీ చేయలేకుండా ఉన్నాము.

శ్రీ పి. గోపాలరెడ్డి (తిరుత్తని—జనరల్) :—అధ్యక్షా, నేను ఆర్థికమంత్రిగారికి, **D.C.T.O.** ల గురించి వ్రాశాను. మనకు అనేక విధాల రావలసిన రాబడి, సేల్సుటాక్సు, బార్డరులో పోతున్నదని వారికి ప్రత్యేకంగా వ్రాశాను. దానిని గురించి ఏమి చర్య తీసుకున్నది, ఆ వివరములు నాకు తెలియలేదు.

డాక్టరు బి. గోపాలరెడ్డి :— **D.C.T.O.** ల విషయం గవర్నమెంటులో జరిగేదికాదు: బోర్డులో జరుగుతూ ఉంటుంది. దానిని కమీషనరుకు పంపడం, వారు దానిని గురించి

దర్యాప్తు చేయడం జరుగుతూ ఉన్నది. ఇటువంటి వ్యక్తిగతమైన వాటిల్లో మేము జోక్యం కలుగజేసుకుంటేమంత్రులు పర్సనల్‌గా కల్పించుకుంటున్నారని, ట్రాన్స్‌ఫర్ చేస్తున్నారని, డిస్‌మిస్ చేస్తున్నారని అంటారు. ఏమీ చేయకపోతే నిద్రపోతున్నారని, పంకాల క్రింద కూర్చొంటున్నారని అంటారు. ఇటువంటి యిబ్బందులున్నాయి. డిపార్టుమెంటల్ హెడ్సును నమ్మాలి, సెక్రటేరియట్‌ను నమ్మాలి, పెద్దపెద్ద విషయాలు చూడాలి, చిన్న విషయాలు చూడటానికి వీలుండదు.

*Mr. Speaker :* I shall now put the cut motion (No. 67) of Sri P. Narasing Rao on Electricity Demand to the vote of the House.

The question is :

"To reduce the allotment of Rs. 200 for Electricity by Rs. 100".

(To disapprove the suspension of the interim relief of Rs. 6 per month to the Hyderabad City Electricity Department workers and the anti-labour policy of the Government in encouraging rival I.N.T.U.C. Union in the Electricity Department at Hyderabad).

The motion was negatived.

*Sri P. Sundarayya :* I demand a division, Sir.

The House then divided.

Ayes : 35

Noes : 67.

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 200 under Demand No. XXVII—Electricity."

The motion was adopted.

*Demand No.* XXXVII—*Capital Outlay on Irrigation.*

*Mr. Speaker :* I shall now put the cut motion (No. 72) of Sri P. Sundarayya to the vote of the House.

The question is :

"To reduce the allotment of Rs. 300 for Capital Outlay on Irrigation by Rs. 100".

(To criticise the policy of the Government in trying to finance the new schemes from the allotments made for existing schemes and also the failure to allot sufficient funds to provide the channels to facilitate full utilisation of the waters of Krishna barrage).

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand No. XXXVII—Capital Outlay on Irrigation".

The motion was adopted.

*Demand No. XLI—Capital Outlay on Multi-Purpose River Schemes.*

*Mr. Speaker:* I shall now put the cut motion (No. 85) of Sri P. Narasing Rao to the vote of the House.

The question is:

"To reduce the allotment of Rs. 9,79,800 for Capital Outlay on Multi-Purpose River Schemes by Re. 1."

(To discuss the delay in the execution of the Godavari Valley Power Development Scheme).

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

"To reduce the allotment of Rs. 9,79,800 for Capital Outlay on Multi-Purpose River Schemes by Rs. 100."

(To criticise the failure of the Government to provide to the staff and labourers working at Nagarjunasagar, fair price shops to supply foodgrains cheaply, and their action in denying housing facilities in the pretext of its being contract labour, and additional dearness allowance of Rs. 6 on the plea of 'work charged' establishments and also their failure to fix the minimum wages.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 9,79,800 under Demand No. XLI—Capital Outlay on Multi-Purpose River Schemes."

The motion was adopted.

*Demand No. XVI—Education.*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to Move:

"That the Government be granted a further sum not exceeding Rs. 89,900 under Demand No. XVI—Education."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 89,900 under Demand No. XVI—Education."

The motion was adopted.

*Demand No. XVIII—Public Health.*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move:

"That the Government be granted a further sum not exceeding Rs. 1,05,500 under Demand No. XVIII—Public Health."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 1,05,500 under Demand No. XVIII—Public Health."

The motion was adopted.

*Demand XX—Fisheries.*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move:

"That the Government be granted a further sum not exceeding Rs. 2,00,000 under Demand No. XX—Fisheries."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 2,00,000 under Demand No. XX—Fisheries."

The motion was adopted.

*Demand No. XXI—Veterinary*

*Dr. B. Gopala Reddi :* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 2,18,100 under Demand No. XXI—Veterinary."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 2,18,100 under Demand No. XXI—Veterinary."

The motion was adopted.

*Demand No. XXIII—Industries.*

*Dr. B. Gopala Reddi :* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 1,48,400 under Demand No. XXIII—Industries."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 1,48,400 under Demand No. XXIII—Industries."

The motion was adopted.

*Demand No. XXVI—Civil Works.*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 4,70,200 under Demand No. XXVI—Civil Works."

*Mr. Speaker:* The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 4,70,200 under Demand No. XXVI—Civil Works."

The motion was adopted.

## B. OTHER EXPENDITURE

*Demand No. XXXVIII—Capital Outlay on Improvement of Public Health*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move:

"That the Government be granted a further sum not exceeding Rs. 100 under Demand No. XXXVIII—Capital Outlay on Improvement of Public Health."

*Mr. Speaker:* The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 100 under Demand No. XXXVIII—Capital Outlay on Improvement of Public Health."

The motion was adopted.

*Demand No. XLII—Capital Outlay on Civil Works.*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move:

"That the Government be granted a further sum not exceeding Rs. 1,51,100 under Demand No. XLII—Capital Outlay on Civil Works."

*Mr. Speaker:* The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 1,51,100 under Demand No. XLII—Capital Outlay on Civil Works."

The motion was adopted.

*Demand No. XLIII—Capital Outlay on Electricity Schemes.*

*Dr. B. Gopala Reddi :* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move :

"That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand No. XLIII—Capital Outlay on Electricity Schemes."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand No. XLIII—Capital Outlay on Electricity Schemes."

The motion was adopted.

*Demand No. XLIV—Other State Works*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move:

"That the Government be granted a further sum not exceeding Rs. 1,00,200 under Demand No. XLIV—Other State Works."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 1,00,200 under Demand No. XLIV—Other State Works."

The motion was adopted.

*Demand No. XLVIII—Loans and Advances by the State Government*

*Dr. B. Gopala Reddi:* Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move:

"That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand No. XLVIII—Loans and Advances by the State Government."

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand No. XLVIII—Loans and Advances by the State Government."

The motion was adopted.

*Mr. Speaker:* The House now stands adjourned till 8-30 a.m. on 2nd November, 1957.

*The House then adjourned till Half Past Eight of the Clock on Saturday, the 2nd November,* 1957.